# సత్యాన్వేషి వేమన

## తాత్వికత పరిశీలన

**అంకితం**

యజ్ఞయాగాలు చేసి పలుమార్లు పుణ్యక్షేత్రాలను దర్శించి
నదీనదాలలో పుణ్యస్నానాలు ఆచరించి బ్రాహ్మణులకు విరివిగా
దానాలు చేసి సర్వము కోల్పోయి నిర్భాగ్యులై బ్రతుకు భారంగా
జీవిస్తున్న అమాయక భక్తులకు -


సేకరణ :

**పెరుగు రామిరెడ్డి**

51-1G, బళ్ళారి రోడ్, కర్నూల్, ఆంధ్రప్రదేశ్.

మొదటి ముద్రణ 1995
కాపీలు 1000

మూల్యం రూ.15=00

ప్రతులు దొరుకు స్థలము : విశాలాంధ్ర బుక్ హౌస్
4-2-237, విజ్ఞాన్ భవన్, సుల్తాన్ బజార్,
హైదరాబాద్-500 195

బ్రాంచిలు : వైజాగ్, విజయవాడ, గుంటూరు, అనంతపూర్,
హన్మకొండ, తిరుపతి, కాకినాడ

ముద్రణ వినాయక్ ఆర్ట్ ప్రింటర్స్
5-38, దిల్ సుఖ్ నగర్, హైదరాబాద్-500 060

వెలువడనున్న గ్రంథము:

"బ్రాహ్మణులు హిందువులా?"

# పీఠిక

ప్రస్తుతము భారతదేశములోయున్న ప్రజలలో భారతీయులు కానివారు బ్రాహ్మణులు (ఆర్యులు), మహమ్మదీయులు బ్రాహ్మణులు అందరు కూడ బయటనుండి వచ్చినవారే మహమ్మదీయులలో 5% లేక 10% మాత్రమే బయటినుండి వచ్చి యుండవచ్చును మిగతా 90% లేక 95% మతము మార్చుకున్న భారతీయులేనంటారు యీ దేశములోయున్న క్రైస్తవ, జైన, బౌద్ధ మతస్థులందరు మతము మార్చుకున్న భారతీయులే బ్రాహ్మణులు క్రీ పూ 1500 ప్రాంతములో యీ దేశములో ప్రవేశించారు మహమ్మదీయులు క్రీ శ 800 ప్రాంతములో వచ్చారు సంఘము నుండి వెలివేయబడిన పంచములు, చిత్రహింసలు భరించలేక బౌద్ధులు మహమ్మదీయులను ఆశ్రయించి ఆ మతములో చేరినట్లు కొందరు చెప్తారు

క్రీస్తుపూర్వం 6000 సంవత్సరములనాడు మొదలై క్రీ పూ. 1500 సంవత్సరములవరకు మన సింధూ నాగరికత వేగముగా అభివృద్ధి చెందినది అనాడు ప్రపంచములో సింధు, ఈజిప్టు, గ్రీసు, సుమేరియా నాగరికతలు ప్రసిద్ధిచెంది యుండినవి యిదివరలో వీటిలో ఏది హెచ్చైనది అని నిర్ణయించుటకు ఆధారములు దొరకలేదు హరప్ప, మొహంజొదారో తవ్వకములలో లభ్యమైన వస్తుసముదాయాన్ని బట్టి అనాడు సింధూ నాగరికతయే హెచ్చైనదని నిర్ణయించారు పురావస్తు పరిశోధకులు హరప్ప, మొహంజొదారో పట్టణాలు ప్రస్తుత పాకిస్తాన్‌లో ఉన్నవి ఆర్యులు మనదేశమునకు రాకపూర్వము అనగా క్రీ పూ 1500 ముందు వున్నదే సింధునాగరికత ఆర్యులు మనదేశము వచ్చునప్పటికి మనదేశ సంస్కృతి నాగరికతలు అంతకుముందు 4000 సంవత్సరముల చరిత్ర కల్గి యుండినవి. అనాడు సింధూ నాగరికతను అభివృద్ధి పరచినవారు ద్రవిడులు దస్యులు అని పిలువబడేవారు వీరు నల్లనివారు

ద్రవిడులు తమ పట్టణాలలో నాల్గు, ఐదు అంతస్తుల భవనాలను కూడ నిర్మించుకొని యుండినారు ఆ భవనాలలో ప్రత్యేకముగా స్నానపు గదులను మురికినీరు పోవుటకు భూగర్భములో కాలువలు కూడ నిర్మించుకుని యుండినారు అనాటికే ద్రవిడులు వ్యవసాయమును బాగుగా అభివృద్ధి చేసియుండినారు వారు వరి, గోధుమ ప్రత్తి తదితరములైన పంటలను పండిస్తుండినారు వారు తమ వ్యవసాయ భూములకు నీటి వసతిని కూడ కలిగియుండినారు వారు అపారమైన పశుసంతతిని కూడ కలిగియుండినారు వారు ఆవులను, ఒంటెలను, గుఱ్ఱాలను, గొర్రెలను, మేకలను పెంచేవారు ముఖ్యముగా గొర్రెలను, మేకలను ఎరువులకు పెంచేవారు ద్రవిడులు వారి పశుసంపదనంతయు వ్యవసాయాభివృద్ధికే

వుపయోగించేవారు వారిలో అధికులు శాకాహారులనియే చెప్పవచ్చును వారు పాలు, జున్ను, వెన్న అధికముగా వుత్పత్తిచేసి ఆహారముగా వాడియుండవచ్చును వారు మత్తుపదార్థములను సేవించువారుకారు ఆర్యులు రాకమునుపు మనదేశములో సోమము అనే మత్తు పదార్థములేదు

ద్రవిడులు రంగురంగుల అందమైన నూలు బట్టలను ధరించువారు అంటే పండించిన ప్రత్తినుండి దూది తీసి వడికి దారముతీసి ప్రవీణులైన నేతపనివారలచేత బట్టలు నేయించుచుండినారు వారు రాగి, ఇత్తడి, మన్ను వగైరాలతో అందమైన పాత్రలను తయారుచేయుచుండినారు ద్రవిడులు తాముచేసిన పాత్రలను వస్త్రములను పర్షియా, గ్రీసు, ఆఫ్ఘనిస్తాన్, బెలూచిస్తాన్ మొదలగు దేశాలకు ఎగుమతి చేయుచుండినారు ద్రవిడులు వారు తయారుచేసిన వస్తువులను ఒంటెలద్వారా వారే నిర్మించుకున్న చిన్న, పెద్ద పడవలద్వారా ఎగుమతులను చేయుచుండినారు

ద్రవిడులు లోతైన కందకాలుగల కోటలు, సుశిక్షితులైన సైనికులు కలిగియుండేవారు ఆనాటి సింధూనది ప్రాంతీయ ద్రవిడులు వ్యవసాయము పశుపోషణ యితర చేతివృత్తులు చేయుచుండెడివారు ఆనాడు వైద్యశాస్త్రము కూడా అభివృద్ధి చెందియుండినది వైద్యశాలలుకూడా కలిగియుండినారు పాఠశాలలుకూడ కలిగియుండినారు అంటే విద్యకూడ అభివృద్ధి అయివుండినది ఆనాడు యింత గొప్పనాగరికత, సంస్కృతి సకల సంపదలు, విద్యలు కలిగియున్న దేశము మరొకటి లేదు ఆనాడు యీదేశము రత్నగర్భ, అన్నపూర్ణ, విజ్ఞాన నిధియని అనేక పేర్లతో పిలువబడేది ఆనాడు సింధూ నాగరితకను కలిగిన ద్రావిడులు చార్వాకులు

ద్రావిడులు చార్వాకమతము (విధానము)ను అనుసరించారు చార్వాకులు కార్యవాదులు తమ పనులు తాము చేసుకుంటారు పనులు నెరవేరునట్లు చేయమని ఏ దేవుని ప్రార్థించరు తాము చేయతలపెట్టిన కార్యమునకు కావలసిన శక్తి తమకున్నదో లేదో ముందుగానే ఆలోచించి ఆ పనిని చేయుటకు పూనుకునేవారు చార్వాకులు దైవాన్ని గురించి వూహించనూ లేదు చార్వాకులు నీతినియమములు కలిగి జీవించేవారు వారికి మోసము చేయడము, ఇతరుల సొమ్మును అపహరించడము తెలియదని చెప్పవచ్చును కాని పనికి తమవలన జరిగిన లోటును గురించి తెలుసుకునేవారు

ఆర్యులు రత్నగర్భగా పేరుగాంచిన మన దేశములో క్రీ పూ 1500 సంవత్సరముల ప్రాంతములో ప్రవేశించినారు యీబ్రాహ్మణులు (ఆర్యులు) మధ్య ఆసియానుండి వచ్చినట్లు చరిత్ర పరిశోధకులు చెప్పాచున్నారు వీరు వచ్చినపుడు వెంట ఏదియును తేలేదు మొలకు వున్ని వస్త్రమును మాత్రము చుట్టుకుని వచ్చారు వారు యిక్కడకు రాకపూర్వము వున్న దేశములోకూడా వారికి యేవృత్తి లేదనియే చెప్పవచ్చును వారు అక్కడ

నేరస్థజాతుల వారైయుండవచ్చును ఆదేశములో వీరి దొంగతనాలు, దోపిడీలను భరించలేక వీరిని దేశమునుండి బహిష్కరించినను దేశమును వదలనందున ఆదేశమునుండి తరిమివేసి యుండవచ్చును వీరు వెంట ఏది తేలేదనుటవలన తరుమబడియుండవచ్చును అను అనుమానము కలుగుచున్నది నేరస్థజాతులకు ధైర్యముమెండు యీ[బ్రాహ్మణులు సింధూ]ప్రాంతము ప్రవేశించినప్పటినుండి స్థానికులైన ద్రావిడులకు వీరికి తరచూ యుద్ధాలు జరిగినవి యీ బ్రాహ్మణులు తెల్లనివారు వారి భాష సంస్కృతము యింతగొప్ప సంస్కృతి, సకల సంపదలు గల ద్రావిడులను వీరు దస్యులు, అసురులు, రాక్షసులు, కిరాతకులు, నల్లనివారు, మాంసభక్షకులు, నరమాంసభక్షకులు అంటూ పిలవడము మొదలిడినారు ద్రవిడులను నీచులుగాను, చులకనగాను సంబోధించడము మొదలిడినారు యీ బ్రాహ్మణులు తాము కూటికి, గుడ్డకు, గూటికి కరువై తరుమబడి యీదేశానికి వలసవచ్చిన బికారులమన్న సంగతిని మరచిపోయారు

వీరు మాంసాహారులు, ఎద్దుమాంసము, గోవుమాంసము వీరికి చాలా ప్రియమైనవి మత్తుపానీయములు అధికముగా సేవించడము వీరికి అల వాటు సోమరసమను మత్తుపదార్థమును అధికముగా త్రాగుచుండెడివారు. ఆనాడు సింధూ ప్రాంతమంతయు ఒకేరాజు పాలనలో యున్నట్లులేదు చిన్నచిన్నరాజ్యాలు కొద్దిపాటి సైన్యాలు కలిగియుండవచ్చు ద్రవిడరాజులు సాంకేతిక, వైజ్ఞానిక, ఆర్థిక, సాంఘిక, రాజనైతిక ఔన్నత్యము కలిగియు న్నారనియే చెప్పవచ్చును ఆర్యులు గెరిల్లాయుద్ధ పద్ధతిలో పోరాటాలు సాగించియుండవచ్చు ఆర్యులు రాత్రులందుపోయి చాలామంది ద్రావి డులను హతమార్చారు త్రాగినమత్తులో రాత్రులందుకూడా సంచరించు సామర్థ్యము ఆర్యులకు వుండినదని చెప్పవచ్చును ఆర్యులలో ఇంద్రుడు అనే దోనికడుప్పువాడుండేవాడు యితడు ఆడ, మగ, శిశువులు అనక దొరికినవారినందరను నిర్దాక్షిణ్యముగా వధించేవాడు ఆనాడు కిరాతకులనే రాజులు కూడ వుండేవారు నీతినియమాలుగల రాజులు వారికున్న కొద్దిపాటి సైన్యాలతో బ్రాహ్మణుల దుండగాలను అణచలేకపోయారు ఒకరి తరువాత వొకరిని బ్రాహ్మణులు జయిస్తూ వచ్చారు అయినా యింకా చాలా రాజ్యాలు మిగిలియుండగానే బాగా నష్టపోయిన బ్రాహ్మణులు స్థానికులతో రాజీపడటము మంచిదని నిర్ణయించుకొని రాజీమార్గాలను వెదికి ద్రవిడులతో సంప్రదించ మొదలిడినారు యిరువర్గాలవారు చాలా నష్టపోయియున్నారు గాన రాజీకి యిద్దరు సుముఖులైనారు ఆర్యులు ద్రవిడరాజులను ఆర్యరాజులుగాను ద్రవిడ విద్యావంతులను ఆర్య బ్రాహ్మణులుగాను, ద్రవిడ రైతులు మొదలగువారిని ఆర్యవైశ్యులుగాను తమలో కలుపుకొనుటకు అంగీకరించినారు యుద్ధాలలో విసిగిపోయిన ద్రవిడరాజులు ఆర్యుల ప్రతిపాదనను అంగీకరించినారు కాని

రైతులందరు యీరాజికి ఒప్పుకొనక చాటుమాటుగా ఆర్యులతో యుద్ధాలు చేస్తూనే యుండినారు కాని ఆర్యులు తమలో చేరిన ద్రవిడ రాజుల సహాయముతో వ్యతిరేకించిన రైతులను సులభముగా ఓడించినారు యిది యంతయు సుమారు వందసంవత్సరములు పట్టియుండవచ్చు అనంతరము సింధూ ప్రాంతమంతయు ఆర్యుల ప్రాబల్యము క్రిందికి వచ్చినది

క్రీ పూ సుమారు 1400 సంవత్సరముల ప్రాంతములో ఆర్య ఋషులు వేదముల రచనకు పూనుకున్నారు వేదములు నాల్గు 1 ఋగ్వేదము 2 యజుర్వేదము 3 సామవేదము 4 అధర్వవేదము

ముందు త్రివేదములంటూ మూడువేదములే రచించినారు తరువాత చాలాకాలమునకు నాల్గవవేదమును రచించినారు యీ వేదాలను బ్రాహ్మణులు వారి జీవనోపాధికై రచించుకున్నారు నాటినుండి నేటివరకు యీవేదాలు వారి బ్రతుకు తెరువుకు పూర్తిగా వుపయోగపడుచున్నాయి యజ్ఞముచేయు సమయములో గుంటతవ్వి అందులో గట్టికట్టెలను కాల్చి ఆ నిప్పులలో నెయ్యి, కొన్ని ధాన్యాలను చల్లి యజ్ఞపశువుయొక్క మాంసాన్ని కాల్చి వేదమంత్రాలను వల్లిస్తూ ఆ కాల్చిన మాంసాన్నితింటూ సోమము (సారాయి) అను మత్తుపదార్థమును హెచ్చుగా త్రాగుతారు యీ త్రాగుడు, తినుడును ఘనకార్యముగా యితరులకు వర్ణించి చెపుతారు తాము వల్లించిన వేదమంత్రాల మహిమవలన అతీతశక్తులు జనించి యజ్ఞము చేయించిన వ్యక్తి కోరికలు తప్పక నెరవేరుననియు, చచ్చిన వెంటనే స్వర్గముచేరుకుంటాడ నియు ముమ్మరముగా ప్రచారము చేస్తారు స్వర్గస్థలమంటూ ఒకటుందా? పోయివచ్చినవారు ఎవరైనా చెప్పారా? మంత్రమహిమలంటూ వుంటె బ్రాహ్మణులు వాటివలన వచ్చే ఫలితాలను తామే అనుభవించక డబ్బులు తీసుకుని యితరులకు ఎందుకు విక్రయిస్తారు? యిది అంతా చూస్తే *ఆకలిగొన్న వాడొకడు సద్ది భుజానవున్నవానితో నాదగ్గర ఆకలి కాకుండా చేసే మంత్రమువుంది. నా మంత్రాన్ని నీకిస్తాను, నీసద్ది నాకిస్తావా? అని అడిగాడట సద్దిగలవాడు నాసద్ది నేనుతిని ఆకలి తీర్చుకుంటాను నీమంత్రముచదివి నీ ఆకలి తీర్చుకో అన్నాడట,* తెలివైనవాడవటము వలన ఆ మంత్రములోనే ఆకలిని చంపే శక్తియుంటే యెదటివానికి ఎందుకు యిస్తానంటాడు ప్రతి విషయములో యెదటివారు చెప్పేమాటలలో ఎంతవరకు నిజమువుందో తెలుసుకోవాలి మూడువేల పై చిలుకు సంవత్సరాలనుండి వేదమహిమలను గురించి చెపుతూ వున్నారేగాని ఎవరు రుజువుగా చేసి చూపలేదు

నోటినుండి పలుకుచున్న ఏ శబ్దముతోను యేశక్తులు వుదయించవు వేదమంత్రాలను చదివి యెప్పుడు ఏ శక్తులను ఎవరు పుట్టించలేదు శక్తులు పుడుతాయని అందరిలో భ్రమలు కల్పించారు వేదమంత్రాలలో కొన్నింటిని వాటి తీరును తెలియజేయుటకు యలమంచిలి వెంకటప్పయ్యగారు రచించిన

"వేదాలంటే ఋవేనా" అన్న పుస్తకమునుండి మీకు అందిస్తున్నాను వేదాలను తెలియగోరువారు పై పుస్తకమును చదువగలరని ఆశిస్తాను

1 ఓ ఇంద్రా! మా స్తోత్రాలను విని మా యజ్ఞము వద్దకు రా సోమరసం తయారుగా వుంది దప్పికగొన్న లేడి ఎంత తొందరగా నీళ్లు త్రాగుతుందో నీవు కూడ అంత తొందరగా వచ్చి సోమరసం త్రాగుము

2 మా మేలు కోరే ఇంద్రుని భార్యను, వరుణుని భార్యను, అగ్నిదేవుని భార్యను సోమరసం త్రాగటానికై మేము పిలుస్తున్నాము

3 ఓ అశ్వనీ కుమారులారా! మీరు అనేక గుర్రాల మీద ధాన్యాలను వేసుకొని మా ఇంటికి తీసుకొని రండి మా శత్రువులను నాశనము చేసే ఓ అశ్వని కుమారులారా! మా ఇంటిని అనేకమైన ఆవులతోను, బంగారముతోను నింపివేయండి

4 ఓ అగ్నిదేవుడా! నీవు దస్యులను, అనార్యులను వారి వారి చోట్లనుండి పారద్రోలుము మేము మా శత్రువుల హంతకుడవైన నీ గుణాలను వెల్లడించే మా మంత్రాల ద్వారా నిన్ను అదే పనిగా పొగడుచున్నాము.

మాటలే మంత్రాలు. వేదాలలోని మాటలను మనము ఇంతకాలము మంత్రాలుగా భావిస్తు వచ్చాము మంత్రములు పఠించడమువలన అతీతశక్తులు బయలుదేరగలవని నమ్ముతూ వచ్చాము పూర్వకాలములో ఆపదలు కలిగినపుడు పెద్దలు ఆపదలో యున్నవారికి ధైర్యము కలిగించుటకు చెప్పినవన్నియు మంత్రాలుగా మారాయి యీనాటికి వాటిని నమ్మడము అవివేకము 18వ శతాబ్దము అంతమయ్యే వరకు కలరా, ప్లేగు, మశూచి మొదలగు అంటు వ్యాధులకు సరియైన వైద్యము లేనందున అతీతశక్తులుగా భావించారు అవి వదలి పోవుటకు భూత వైద్యము చేయించారు భూతవైద్యులు కూడా మంత్రాలను వల్లిస్తూ ఓం, డీం, శాంభవి అంటూ యేవేవో వాగేవాళ్లు ఇవి అన్నియు మన తృప్తి కోసము చేశారు. నేడు పై వాటికన్నిటికి వైద్యశాస్త్రజ్ఞులు పరిష్కారము కనుగొన్నారు ఈ దినము వైద్యము మనకు అందుబాటులో యున్నది కావ యెవరు భూతవైద్యులను ఆశ్రయించరు మనము ఈనాడు మంత్రశక్తులకంటె అధికముగా యంత్రశక్తులను చూస్తున్నాము వేదాలు క్రీ.పూ 1500 సంవత్సరముల ప్రాంతాలలోరచించియుండవచ్చు3500 సంవత్సరముల క్రితము మానవుడు ఏ స్థితిలో యున్నాడో వూహించండి ఈనాటి మానవునితో నాటి మానవుని పోల్చిన, నాటి మానవుని జ్ఞానము అత్యల్పము 3500 సంవత్సరముల క్రిందట వ్రాసిన వేదాలను నమ్ముచున్నామంటే

మనము ఆకాలము మనుష్యులమే కాని యీ కాలము మనుష్యులము కాలేము ఇంత సుదీర్ఘమైన కాలము ప్రపంచములో ఏ దేశీయులు అంత పాతకాలము రచనలను నమ్మి వాటికి కట్టుబడి లేరనుకుంటాను మనలో పాత భావాలను పాత అలవాట్లను సడలిపోనీయక బ్రాహ్మణులు తమ జీవనోపాధికై వాటిని కాపాడుచున్నారు మనము పంచభూతాలనే ప్రత్యక్ష దైవాలుగా చూస్తున్నామే కాని ఇంతవరకు అతీతమైన శక్తులను మనకు యెవరు చూపలేదు మంత్రశక్తులున్నాయని చెప్పేవారు ఆ శక్తులద్వారా వారే మహోన్నతమైన జీవనాన్ని పొందవచ్చును గదా? ఎందరో బ్రాహ్మణులు ఈనాడు విజ్ఞానశాస్త్రాన్ని పఠించి ప్రభుత్వములో కీలకమైన స్థానాలను అధిష్టించి దేశానికి ఎంతో సేవ చేస్తున్నారు పౌరోహితులు మాత్రము తోటి మానవులలోని బలహీనతలను ఆసరాగ జేసుకొని పాపాలను తొలగజేస్తామని, సంపద కలుగజేస్తామని ఏవేవో వ్రతాలు, పూజలు చేయించడమేకాక యాత్రలు చేయండని ప్రబోధిస్తుంటారు వేదాలను పురాణాలను నమ్ముకొని యున్నచో మనము పురాణాలు వ్రాసిన కాలములోనే యుంటాము కాని అభివృద్ధి కాలేము, యీ కాలము వారలము అని అనిపించుకోలేము

పురాణాలు మనకే కాదు, ఇతర దేశస్తులకు కూడా వున్నాయి గ్రీసు దేశములో హోమరు అను మహాకవి మనకు వాల్మీకి, వ్యాసుడు వ్రాసినట్లే చాలా పురాణాలను రచించినాడట కాని గ్రీకులు హోమరు రచనలనన్నిటిని క్రీ॥ పూ.500 సంవత్సరాలనాడే విలువ లేనివిగా భావించి వాటిని చూడడము మానివేశారట గ్రీసులో క్రీ పూ 400 సంవత్సరములలో సోక్రటీస్ అను తత్త్వవేత్త జన్మించి యువకులను నానా విధములైన ప్రశ్నలు అడుగుతూ వారిలో యున్న అజ్ఞానాన్ని వారు తెలుసుకునేటట్లు చేశాడు యువకులందరు ఆయన చేత ఆకర్షితులైనారు ప్రభుత్వ వ్యతిరేకతను బోధిస్తున్నాడని సోక్రటీస్‌కు విషమిచ్చి చంపింది నాటి ప్రభుత్వము ఆయన శిష్యుడు ప్లేటో యీాయన ప్రజాస్వామిక విలువలను గురించి ప్రజలకు బోధించాడు రిపబ్లిక్ అను గ్రంథమును వ్రాశాడు రాజకీయ పాఠశాలలను నెలకొల్పి బాధ్యతగల రాజకీయవేత్తలను తయారుచేశాడు మొట్టమొదటి సాంకేతిక పరిజ్ఞాని ఆర్కిమిడీస్ క్రీ.పూ 287లో గ్రీసులోనే జన్మించాడు ఆయన ఇంజనీరింగ్‌లో ఎన్నో పరిశోధనలు చేసి రూపొందించిన సూత్రాలు ఈనాటికి ఆచరనీయములే అంటారు ఆనాడు గ్రీస్ ప్రపంచ దేశాలన్నింటిలోను బాగా అభివృద్ధి చెందిన దేశము

ఈనాటికి మన వేదపండితులు ఏ దేశములో యే సైంటిస్టు పరిశోధించి ఏ కొత్తను కనుగొన్నా వేదాలలో మా పూర్వీకులు ఈ విషయాన్ని యెప్పుడో వ్రాశారంటారు కాని వేదాలను ఆధారము- చేసుకొని ఏ

పరిశోధనా చేయరు ఏ కొత్తను కనుగొనరు విజ్ఞాన శాస్త్రము వేదాలలో లేదు ఈనాడు పాశ్చాత్య దేశాలలో ఆధ్యాత్మికత అడుగంటిపోయినదని ఇప్పుడు పాశ్చాత్య దేశాలన్నియు ఆధ్యాత్మికతను భద్రపరచుకొన్న మనవైపు చూస్తున్నాయని చెప్పుచుంటారు నేను అమెరికా వెళ్లాను భారతీయులను గురించి మీరేమనుకుంటున్నారని చాలామంది అమెరికనులను అడిగాను కొందరు బీదదేశమన్నారు కొందరు మీ దేశములో మూఢనమ్మకాలు అధికముగా అని ప్రశ్నించారు? మరికొందరు మీ దేశములో దేవతల సంఖ్య చాలా అధికముగా వున్నదట నిజమేనా అని ప్రశ్నించారు మన ఆధ్యాత్మికతను గురించి ఎవరూ మాట్లాడలేదు ఆధ్యాత్మికతద్వారా మనము ఏమి సాధించాము యీనాడు మనము ఏ స్థితిలోయున్నాము మన వుత్పత్తులు ఎంత ప్రపంచ దేశాలతో పోల్చి చూడండి ఏ దేశముతోను పోల్చకనే మనలను మనము పొగడుకొనడము ప్రయోజనములేని పని

*వేదాలను గురించి పెద్దల అభిప్రాయాలు.*

## బుద్ధ భగవానుడు

వేదాలు ఎంతో హాస్యాస్పదమైనవి, వ్యర్థమైనవి, పనికి మాలినవి నాడు బ్రాహ్మణులకు గల వినాశకరమైన జ్ఞానం వేదాల ద్వారా తెలియజేశారు వేదాలు నీరులేని ఎడారి లాంటివి దారితెన్నులేని అడవిలాంటివి కావ తెలివి గల మనిషి యెవడూ వేదాలను చదువడు అతడు అవి తన కోర్కెలను నెరవేర్చగలవని ఆశ పెట్టుకోడు

## కబీర్ దాస్

పరమాత్మ వేదాలకు అందడు కాని బ్రాహ్మణ పండితులు వేదాలలో పెనవేసుకొని పడిచస్తారు నిజానికి వేదాలు అసత్యానికి చక్కని బారు చొక్కా !

## ఆచార్య చార్వాకుడు

వేదాలను మూడు రకాల మనుషులు మోసగాళ్లు, హాస్యగాళ్లు, దొంగలు రచించారు వేదాలను బుద్ధిమంతులు, నీతిమంతులు రచించలేదు. ఎందుకన వాటిలో అశ్లీలమైన అర్థంలేని హింసాయుతమైన మంత్రాలు కోకొల్లలుగా వున్నాయి

## కొందరు పాశ్చాత్య పండితులు

వేదములు కాలబద్ధములు అవి మానవుని అనాగరిక దశయందు రచించబడిన గ్రంధములు పంచభూతాలను, చెట్టుపుట్టలను, నదీ పర్వతములను ఆరాదించు అనాగరికుల పాటలే వేదములు స్వర్గమును

ఆకాంక్షించుచు ధనధాన్యాలను, పశుసంపదలను సంతానమును కాంక్షించియో రోగనిర్మూలనమును శత్రునాశనమును కాంక్షించియో పెక్కు దేవతలను ఆరాధించిన వారి గ్రంధములే వేదాలు

## మ్యాక్సుముల్లర్ జర్మన్ సంస్కృత పండితుడు

ఋగ్వేదములో 10,500 పై చిలుకు ఋక్కులున్నాయి వాటిలో కొన్ని ప్రార్ధనలు, కొన్ని స్తోత్రాలు, కొన్ని మంత్రాలు, కొన్ని వృత్తపాటలు వున్నాయి ఒకప్పుడు అవి వాస్తవము, అద్భుతము అయినవి కాని తరచు చపలంగాను, పామరంగాను, దురవగాహంగాను కూడ వుంటాయి

## ముండకోపనిషత్

జ్ఞానము రెండు రకాలు (అనుభవజ్ఞానము) 1) ఉన్నతమైనది, 2) నీచమైనది నాలుగు వేదాల జ్ఞానము నీచమైనది

క్రీ పూ 1500 నుండి క్రీ పూ 500 వందల సంవత్సరముల వరకు వెయ్యి సంవత్సరములు బ్రాహ్మణులు రాజుల పంచన చేరి యజ్ఞయాగాదులను చేయిస్తూ వేదాలను ఆసరాగా చేసుకొని సుఖజీవనాన్ని గడిపారు క్రీ పూ 510 ప్రాంతములో బుద్ధుడు జన్మించాడు బుద్ధుడు రాజు, వివాహితుడు కొన్ని చెడు సంఘటనలను చూచి మనస్సు చెలించినవాడై రాజ్యాన్ని, భార్యను, కొడుకును వదలిపోయి 7 సంవత్సరములు కఠోరమైన తపమాచరించి క్రీ పూ 530లో జ్ఞానోదయమై తిరిగి వచ్చి బౌద్ధమతాన్ని స్థాపించాడు సత్యము, అహింస, ప్రేమ కలిగి జీవించవలెననియు దుఃఖమును నిర్మూలించవలెనని బోధించాడు హింసతో కూడియున్న యజ్ఞయాగాదులను బహిష్కరించవలెనని పూజలు ప్రయోజనము లేనివని బోధించాడు బుద్ధుని బోధనలకు చాలా మంది ఆకర్షితులై యజ్ఞయాగాదులను మానివేశారు బుద్ధుని అనంతరం అశోకుడు బౌద్ధమతాన్ని స్వీకరించి బౌద్ధమతాన్ని చైనా, జపాన్, ఇండోనీషియా, థాయిలాండు, బర్మా, సిలోన్ దేశాలలో వ్యాప్తము చేశాడు అశోకుని అనంతరం బౌద్ధమతమును పోషించువారు లేరైరి క్రీ శ ఆరంభములో తిరిగి బ్రాహ్మణులు రాజుల పంచన చేరి యజ్ఞయాగాదులను చేయించుట మొదలిడినారు బుద్ధుడు అశోకుని కాలములలో వేదములు పూర్వమున్న గౌరవాన్ని కోల్పోయినవి

ఇంతవరకు వేదాలనాధారంగా చేసుకొని బ్రతికిన బ్రాహ్మణులు వాటికి తోడు క్రీ శ 200 ప్రాంతములో పురాణాలను రచించినట్లు చరిత్రకారులు చెప్తున్నారు రామాయణం, భారతం, దశావతారాల కధలు మొదలగు పురాణాలన్నియు క్రీ శ నందు రచించినవే ఇవి యన్నియు బ్రాహ్మణులే

వ్రాశారు కాని ఇతరులు వ్రాసినట్లు చెప్పారు ఇవి యన్నియు కల్పిత కథలేకాని చరిత్ర కాదు తిరుపతిలో వెంకన్నను లక్ష్మీదేవి నిద్రపోనీయనందున మరచి నిద్రిస్తాడని సుప్రభాతము పాడి నిద్రనుండి మేలుకొలిపే ఏర్పాటు చేశారు స్నానము చేయించడము, మధ్యాహ్నము నైవేద్యము, రాత్రి చీకటిలో నిద్రించలేడని దీపారాధన చేయడము, నిద్రపోయెంతవరకు ఆ రాతి విగ్రహాల ముందు దేవదాసీలు నాట్యము చేయడము ఆ రాతి బొమ్మలను పట్టు వస్త్రాలతో అలంకరించడము ఆభరనాలను తొడగడము తిరుపతిలో వెంకన్నకు పాత పెండ్లాముతోనే రోజు పెండ్లి చేయడము ఇవి యన్నియు ఏర్పాటు చేశారు వీటన్నిని నిర్వహించుటకు దండిగా రాజులచేత మాన్యాలను కూడ ఏర్పాటు చేయించుకున్నారు. బ్రహ్మ తమను ముఖాన, క్షత్రియులను, భుజములలో వైశ్యులను, తొడలయందు శూద్రులను, పాదములచెంత సృష్టించాడని శూద్రులు పై మూడు జాతులకు సేవ చేయుటకే బ్రహ్మ సృష్టించాడని ఇవియన్నియు జరుగుతుండగా తాము చూచినట్లు బ్రాహ్మణులు చెప్పారు పంటలు రాగానే నవధాన్యములను బ్రహ్మణునికి దానముచేసిన తరువాతే పండించిన రైతు తినుటకు అర్హుడు అన్నారు ప్రతి యువతి తొలి రోజు రాత్రి బ్రాహ్మణునితోనే సంభోగము చేయునట్లు కూడా చేసుకున్నారు ఇది వారి హక్కుగా ప్రచారము చేశారు వేదపురాణాలను పఠించి జీర్ణించుకొన్న పెద్దల అభిప్రాయాలను చదవండి వీటిని గురించి వేమన అభిప్రాయములు యీ పుస్తకములోనే వున్నాయి

## స్వామి వివేకానంద

బ్రాహ్మణులు పుస్తకాలు వ్రాయడము ఎప్పుడు జరిగినా ఇతరుల భావస్వాతంత్ర్యాన్ని హరించడమే జరిగింది. పేదలకు శూద్రులకు ఏ హక్కులు లేకుండా వ్రాశారు

## రాముడు - కృష్ణుడు నుండి

శూద్రుడైన శంబుకుడు తపమాచరించుచున్నందున ఒక బ్రాహ్మణుని కొడుకు మరణించాడు శ్రీరామచంద్రునకు విన్నవించగా రాముడు పోయి తలనరికాడు బ్రాహ్మణుని కొడుకు బ్రతికాడు శూద్రుడైన వాల్మీకి తపమాచరించినప్పుడు ఏ బ్రాహ్మణుని కొడుకు చావలేదు ఎందుచేత?

## మహాత్మ పూలె

పాములను ఆభరనాలుగా ధరించిన విచిత్ర స్వభావముగల శివుని ఆశీర్వాదమువలన దుందుభి అను రాక్షసునికి వంద మనిషి తలలు, వంద ఏనుగుల తలకాయలు, వంద గుర్రాల తలలు, పదివేల చేతులు వుంటాయి కాని రెండే కాళ్లు వుంటాయి రావణునికి పది తలలు, పది ముక్కులు,

ఇరవై కళ్లు, ఇరవై చేతులుంటాయి కాని కాళ్లు రెండే, ముడ్డి ఒక్కటే అంటారు

## విశ్వమానవతావాది జాషువా

*పెద్దల శల్యముల్ వలె వివేకమొసంగని గ్రంథరాసులే*
*విద్దియలైన యింక పదివేల యుగాల్ తలకాయలేని*
*గంగెద్దులు పుట్టి స్వార్థ పరులెత్తిన గంతలుమోసి తీరెడిన్*
*బుద్ధి చిగుర్చునేయరుచి కథల్ తలమీద రుద్దినన్*

మన పురాణాలన్ని మనకు అజ్ఞానాన్ని ప్రసాదిస్తాయేకాని విజ్ఞానాన్ని యివ్వవు కాన వాటిని తలపరాదు యివి యన్నియు బ్రాహ్మలు వారి మేలు కోరి వ్రాసుకున్నవే

## స్వామి వివేకానంద

Come be men! Kick out priests who are always against progress Because they would never become big They are the off springs of centuries of superstation and tyrani root out priest craft first

లేవండి, మనుషులు కండి, యీ పురోహితులను నేలబెట్టి కాలరాయండి వీరంతా అభ్యుదయ ప్రతీఘాతకులు గొప్ప గుణం వీరికి నాస్తి వీరంతా శతాబ్దాల మూఢవిశ్వాసాల క్రూరకృత్యాల ముద్దలు కాన యీ పురోహిత వర్గాన్ని నేలమట్టం చేయండి ॥వేమన వేద శాస్త్రంనుంచి॥

బుద్ధుడు పుట్టిన యీ దేశములో బౌద్ధమతాన్ని నామరూపాలు లేకుండా రూపుమాపిందెవరు? 84000 బౌద్ధస్థూపాలను నేలమట్టం చేసిందెవరు? బౌద్ధారామాలను కూల్చి వాటిపై దేవాలయాలను నిర్మించిందెవరు? ఒక్కసారి మీ దృష్టిని చరిత్ర పుటలలోకి మరల్చండి

ప్రపంచ ప్రజలందరు బుద్ధుని భోదనలను శ్లాఘిస్తుంటే బుద్ధుడు పుట్టిన యీ దేశములో బౌద్ధులను గానుగలలో వేసి చంపిందెవరు? ఆదిశంకరాచార్యులు క్రీ శ 788 పుట్టి 820లో మరణించాడు యితడు ఎన్నో మహిమలు కలవాడుగా వ్రాశారు (1) ఒక బ్రాహ్మణి వుసరికాయను భిక్షవేసింది ఆమె పేదరికాన్ని గుర్తించి శంకరుడు బంగారు వుసరికాయల వర్షం కురిపించాడు ఆ యింటి ముందు (2) తల్లి పూర్ణానదికి స్నానానికి పోయివస్తూ దారిలో పడిపోయింది అది చూచిన శంకరుడు ఆ నదిని తమ యింటిముందుగా ప్రవహించునట్లుగా చేశాడు (3) శంకరుడు తన 8వ యేట నదిలో స్నానముచేస్తుండగా మొసలి కాలును పట్టింది నన్ను సన్యసించడానికి అనుమతిస్తే మొసలి

వదులుతుందన్నాడు తల్లితో తల్లి అనుమతించింది. వెంటనే మొసలి వదలిపెట్టింది (4) రేవానదికి వరదలురాగా శంకరుడు తన మంత్రశక్తితో నది నీటినంతను మట్టిముంతలో పట్టివేశాడు (5) నదిలో నీటిపై నడక సాగించాడు చిలుకలు శాస్త్ర చర్చ చేయగా విన్నాడు చెట్టు వంచాడు, పరకాయ ప్రవేశము, బంగారంచేసే విద్య నేర్చాడు కరిగించిన సీసాన్ని గటగట త్రాగినాడు యివియన్నియు ఎంత విడ్డూరాలో ఆలోచించండి యిటువంటి కథలన్నియు చదువురాని సామాన్య ప్రజలకు వినిపిస్తూ వారిని గొర్రెలుగా బర్రెలుగా మార్చారు అహింస, సత్యము, సంఘసేవనూ ప్రజలకు భోదిస్తున్న బౌద్ధులను రూపుమాపడములో శంకరాచార్యులు ప్రథములయ్యారు (రావిపూడి వెంకటాద్రిగారి ఆదిశంకరాచార్య వ్యక్తిత్వం - తత్త్వం చదవదగినది చదవండి)

జ్యోతిష్యం అశాస్త్రీయమైనదని గ్రహచలనాన్ని బట్టి మానవ జీవితం నడుస్తుందని చెప్పడం అబద్ధం శాస్త్రాధారములేని కట్టుకథయని 192 శాస్త్రవేత్తలు అందులో ప్రసిద్ధిచెందిన ఖగోళ శాస్త్రజ్ఞులు అంతరిక్ష పరిశోధకులు అందులో 18 మంది నోబుల్ బహుమాన గ్రహీతలు సమావేశమై జ్యోతిశ్యము శాస్త్రముకాదని ఖండించారు ప్రపంచ ఖ్యాతిగాంచిన కెప్లరు అను జ్యోతిశ్యుడు చివరి దశలో జ్యోతిశ్యము తప్పు అని నాకు తెలుసు అయినా పొట్ట కూటికై ఆ పని చేయక తప్పలేదు అని చెప్పాడు దశరథ మహారాజు ఆస్థాన జ్యోతిశ్యులను పిలిచి యింకా తానెంత కాలము బ్రతుకగలనని ప్రశ్నిస్తే 6 సంవత్సరములవరకు రాళ్ళతో కొట్టినా చావు లేదన్నారట కాని 6 మాసాలు తిరుగక మునుపే చచ్చాడట

15వ శతాబ్దములో జలప్రలయమై భూలోకము అంతమౌతుందని జ్యోతిశ్యులు చెప్పి నాటి ప్రజను భయభ్రాంతులను చేశారట కాని ఏ ప్రళయము రాలేదు

1962 అష్టగ్రహకూటమివలన ప్రళయం వస్తుందని యిటాలియన్ చాందసులు భారతీయ జ్యోతిశ్యులు చెప్పారు కాని ఏ ప్రళయము రాలేదు.

జ్యోతిశ్యము వల్లకాని, మంత్రాలవలనగాని, మ్యాజిక్ వలనగాని ప్రపంచ ప్రజలు యెదుర్కొంటున్న సమస్యలు పరిష్కారము కావు ఆ భావన కలిగియుండడం ఓటమికి చిహ్నం ॥నెహ్రూ॥

జ్యోతిశ్యం పేకాట వంటిది. డా॥ A T కొవ్వూర్ మహత్తరమైన త్యాగాలవల్లనే మహత్తరమైన పనులు సాధించబడ్డాయి ॥స్వామి వివేకానంద॥

తనను గూర్చి తెలియనివాడే అజ్ఞాని "సోక్రటీస్॥

ప్రపంచములో అన్ని దేశాలలో, మతాలలో దేవుడు ఒక్కడే, మన దేశములో తప్ప

యజమాని సేవకుని తొలగించినట్లు ప్రజలు విప్లవం, లేక ఓటు ద్వారా ప్రభుత్వాలను తొలగించవచ్చు ||రూసో||

సంఘసంస్కర్త, సతీసహగమనానికి వ్యతిరేకముగా పోరాడిన వ్యక్తి, మా పుక్కిటి పురాణాలు మమ్ములను బాగుచేయలేవు మీ విజ్ఞాన శాస్త్రాన్ని నేర్పి మమ్ములను బాగుచేయండని బ్రిటిష్ ప్రభుత్వాన్ని అర్థించాడు ||రాజా రామమోహనరాయ్||

రాజుకు దేవుడు దయ్యములను గురించిన మూఢనమ్మకాలు వుండరాదు కాని ప్రజలలో ఆ నమ్మకాలను వ్యాప్తము చేయాలి అని రాజుకు బోధించాడు కౌటిల్యుడు (చాణక్యుడు) కౌటిల్యుని బోధనల మేరకు గ్రామాలలో స్థిరపడియున్న పూజారులు దేవుడు దయ్యములను ప్రజలలో బాగా వ్యాప్తము చేయుచున్నారు ప్రజలను అజ్ఞానములో వుంచేందుకు పాలకులు మతవిశ్వాసాలను, మూఢనమ్మకాలను ప్రోత్సహిస్తూనే యున్నారు.

మొగల్ పాలన భారతావనికి అందించిన మరపురాని చిహ్నాలలో తాజ్ మహలు, ఉర్దూ గాలిబ్ మూడు అంటారు గాలిబ్ నా మతం ఏకత్వము, నా నమ్మకాలు పూజలు విసర్జించడము, కులమతాలన్నింటిని కాలదన్ని ఒకే మానవ మతాన్ని నెలకొల్పడం అవసరం అంటాడు మన పీఠాధిపతులు యీనాటికి సతీసహగమనము మా సాంప్రదాయము యితరులు ప్రశ్నించరాదంటున్నారు

అసమానత నుంచి హింస, సమానతనుంచి అహింస పుడుతాయి ||మహాత్మా గాంధీజీ||

సంఘ సంబంధాలలో సమానత్వాన్ని ఆచరణలో చూపించకపోతే, అహింస గురించి మాట్లాడడం అర్థరహితం ||గోరా||

మనదేశములో 32 లక్షల దేవాలయాలున్నాయి అందులో 1500 వందలు కాశీలోనే వున్నవి

నా యీ రచనలో యితరులను ఒప్పించుటకు ప్రయత్నించాను కాని, మెప్పించుటకు కాదని మనవి

- రచయిత

# మన చరిత్ర

తెలుసుకో తెలుసుకో నీదివ్య చరితం
నిప్పు నీరు గాలి నీలోన యుండె
మట్టితో జేసిన తనువు నీకుండె
శూన్యమే నీకిచ్చె సంచారవసతి
తలుచుకో తలుచుకో మృగజీవితంబు
క్రూర మృగములనుండి రక్షించిరెటుల
కొండ కోనలలోన జీవించిరెటుల
ఊహించు వూహించు ఆది మానవుని
ఆదిలో మనిషికి మాటలేలేవు
పుట్టించె నాతడు శబ్దంబు నోట
శబ్దాన్ని క్రమముగా మాటలుగ మార్చె
మాటల్లో మాటల్లో చర్చ వుదయించె
చర్చలో జగతిని చర్చించినారు
యీ జగతి క్రమునకు ఏది మూలంబు
యీ జగతి నడిపించదాగింది శక్తి
ఆ శక్తి నూహించి దైవమన్నారు
ఊహలో పుట్టెను దైవనామంబు
ఊహ ఊహే కాని నిజము కాదనుచు
చార్వాకులైనారు ద్రవిడ సంతతులు
ప్రాణి జీవించ మూలకారణంబరసి
పంచభూతాలు హేతువని తేల్చి చెప్పారు
జ్ఞానులై వారలు నిర్మించినారు
హరప్పా, మొహింజదారో నగరవాసాలు
అరుదెంచి నారెటులో ఆర్య సంతతులు
క్షీణింప జేసిరి మనదు జ్ఞానంబు
తమ రంగు గొప్పదని చాటుకున్నారు
వర్ణాలు నాల్గని వొప్పించినారు
బ్రహ్మయే రాసిచ్చె వేదములు మాకు
దేవుడె మాబంటు మీరెంతవారు
జగతిని శాసించ జన్మించినాము

మహిమలు కలిగిన మంత్రాలు మాచెంత గలవు
బ్రహ్మ వంశజులమైన బ్రాహ్మలము మేము
మా పాదసేవకై బ్రహ్మ సృష్టించె మిమ్ము
కోపించినట్టులైన శపియించగలము
అదిరించి బెదిరించి లొంగదీశారు
బానిసలమైనాము బాపలకు లొంగి
బ్రహ్మకదు కలదనుచు భ్రమలు కొలిపారు
స్వర్గలోకం బొకటి సృష్టించినారు
అక్కడి వేశ్యల వర్ణించ తరమా
రంభతో భోగించ మార్గమొకటుంది
యాగంబు జేసిన రంభ ఫలమబ్బు
తాగి తినమరిగి యజ్ఞాలు చేయించినారు
వూరూర గుడులను కట్టించినారు
దేవులకు రూపాలు కల్పించినారు
సత్యాన్ని శోధించి తెలుసుకో నీవు
గట్టి రాళ్లకు పూజ చేయించినారు
గుడులన్ని కట్టిరి క్రీస్తు శకమందు
క్రీస్తుశకము ముందు గుడులులేవెందు
మలుచు మలుచుకో నీదు భవితంబు
సత్యమొక్కటే నిన్ను కాపాడగలదు
అనృతంబు లేదిందు అవగింజంత
చార్వాక వంశాన జననమొందావు
నీ వంశరక్తాన్ని నిలబెట్టుమోయి
బుద్ధుని త్యాగాన్ని గుర్తించరైరి
బౌద్ధ భోదలమించి భోదించెవరు
సత్య అహింసలని చాటిచెప్పాడు
ప్రేమతో దుఃఖాన్ని తొలగించ మనియె
బుద్ధునిబోధనలను జీర్ణించరైరి
బౌద్ధావలంబకుల కాల్చి చంపారు
బౌద్ధారామాల నేల కూల్చారు
మాయమాటలు చెప్పి మోసగించారు
తమ క్రూరతత్వాన్ని చాటుకున్నారు
జాలియన్నది వారి వంశాన లేదు

ఎద్దుమాంసము లేకముద్దెత్తలేదు
సోమపానము జేసి సోంబేరులైరి
చార్వాక పాలనలో వికసించినాము
ఆర్యులరాకతో కుంచించినాము
తెలుసుకో తెలుసుకో నీ పూర్వ చరితం
రంకు రామాయణము రచియించిరెపుడు
బొంకు భారతమును వివరించిరెపుడు
రాసినారన్నియు క్రీస్తుకమందె
శోధించి తెలుసుకో పూర్వచరిత్రలను
తెలుసుకో తెలుసుకో నీ హీన చరితం
వాల్మీకి వ్యాసులు జనియించలేదు
కల్పించి వ్రాశారు భూసురులు తామే
రాముడే దేవుడని వచియించినారు
తాటకిని వధియింప మనసెట్లులొప్పె
శంబుకుని వధియించె ఏ కారణంబరసి
వాలిని వధియింప చేతులెట్లాడె
యిట్టి క్రూరాత్ముడు దేవుడెట్లాయె
తలుపొద్దు తలుపొద్దు యాదుష్టచరితు
బాధలే పడలేక సీతమ్మ బావిలో దూకె
నది గర్భమున మునిగి రాముడెచచ్చె
యీ దుష్ట చరితునకు యింతవ్యాప్తంబా
అందుకే అన్నాడు వేమన్న గూడ
నీ చరితనే నెరిగి వచియించినాను
విశ్వదాభిరామ వినుర విషమా అనుచు
రాముడే కలిగుండె నిలువెల్ల విషము
విషము కల్గినవాడు దేవుడెట్లాయె
హృదయములో రామునికి చోటీయవద్దు
మనసస్సంత మలిన మౌరామున్ని తలప
చోరుడై కృష్ణుడు వర్ధిల్లినాడు
కృష్ణుడే జారుడై విలసిల్లినాడు
చోర జారత్వాలు లీలలన్నారు
భూసురులగురియించి ఏమి వ్రాసేది ఏమి చెప్పేది
దైవ నిర్ణయమని చాటి చెప్పారు

మీ ఖర్మ ఫలితము తప్పేది కాదు
రాశారు కథలన్ని వారి జీవనోపాదికై
మన భావస్వేచ్ఛను హరియించినారు
పదితలలతో బుట్టె రావణాసురుడు
చిలుక గర్భములో వుదయించె శ్రీశుకుండు
ఏనుగుతలతో బుట్టెయీసునికి కొడుకు
పాయసానికి పుట్టె రామచంద్రుండు
ఏ దేశమునలేని వింతదేవుల్లు
యీ దేశమున పుట్టి భారమైనారు
హృదయభారము తగ్గయోచించ ఓయీ
నీ మదిలో దాగారు కోట్ల దైవాలు
నిజ మెరిగివారిని పారద్రోలోయి
విజ్ఞాణశాస్త్రాన్ని పఠియించు మోయి
జ్ఞాణివై యిలలోన వర్ధిల్లవోయి
చార్వాక తత్వాన్ని గ్రహియించుమోయి
బుద్ధునిబోధనలను జీర్ణించుమోయి
వేమనను తెలుసుకో వివరంబుగాను
మహాత్మపూలేకు పూజలందించు
అంబేత్కరుడు మనకు ఏమిసూచించె
గుఱ్ఱంజాషువాను గురునిగా యెంచు
పఠియించు పైవారి తత్వాలు అన్ని
జ్ఞాణివై వెలిగేవు సంశయము లేదు.

# విశ్వదాభిరామ వినురవేమకు వివరణ

వేమన మన వేదాలను, పురాణ గ్రంధాలను జిజ్ఞాసతో పఠించాడు ఆయనకు వేదాలలోగాని, రామాయణము, భారతములలోగాని యేవిధమైన భక్తి మార్గము లేదా ఉన్నత బోధనలు కానరాలేదు వేమన ఏది-చదివినా అందులోని సారాన్ని గ్రహించి కొద్ది మాటలతోనే విమర్శించగల సమర్థతగల జ్ఞాని అయిన తన బోధనలను ఆటవెలదులద్వారా వినిపించాడు. అందులోను రెండు పంక్తులలో తాను చెప్పదలచిన విషయాన్ని చెప్పి, మూడోపంక్తిలో ఉపమానాన్ని యిచ్చి, నాల్గవ పంక్తిలో విశ్వదాభిరామ వినురవేమ అనుమకుటాన్ని యిచ్చాడు వేదాలలో తాను గ్రహించిన సారాన్ని నాల్గు పద్యములలోను అలాగే రామాయణ, భారతాలను కూడా నాల్గు, నాల్గు పద్యములలో విమర్శించాడు ఏమి సారములేని యీ గ్రంధాలకు ఇంత ప్రాధాన్యత యెలా వచ్చిందనే ఆవేదనతో వేమన తన శతకాన్ని ప్రజల ముందుంచాడు వేమన పద్యాలు అక్షర సత్యాలు సామాన్య ప్రజలను తప్పుమార్గము పట్టిస్తున్న యీ గ్రంధాలను వివరముగా తెలియజేసి వారిని సరియైన మార్గములోకి మళ్లించాలని కంకణము కట్టుకున్న వేమన నిర్విరామముగా కృషి చేశాడు వేదాలు, పురాణాలను పూర్తిగా తడచి తుడచి వేసినగాని అభివృద్ధిని సాధించుటకు వీలుపడదని గ్రహించాడు యివి యన్నియు ప్రజల మనస్సులను వికసించనీయవని గ్రహించాడు ప్రజలలోని మూఢనమ్మకాలను తొలగించి వారి మనస్సులను వికసింపచేయవలయునను కోరికతో నాలుగు లేక ఐదువేల పద్యములతో తన శతకాన్ని రచించాడు అని కొందరు 10 వేల పద్యాలు వుండవచ్చునని కూడా అంటున్నారు. ఆయన దేశ సంచారముచేస్తూ తన రచన సాగించడము వలన ఎక్కడికక్కడ వదలివెళ్ళాడు. C.P బ్రౌన్ దొరగారు ఆయన పద్యాలను వెదకించి ప్రోగుజేసి వేమనను మన మధ్యలో యుండునట్లు చేయగలిగాడు రాముడు ఇంత వ్యాప్తుడగుటకు ఏ కారణాలు అగుపడవు

*విశ్వాభిమాని రామా వినురా!*

విశ్వప్రజలందరిచేత అభిమానించబడిన రామా వినురా, విశ్వవ్యాప్తుడవైన ధామ వినురా అంటూ తన బోధనలను శ్రీరామచంద్రునకే బోధించాడ వేమన

పూర్వకాలములో శిశు మరణాలు అత్యధికముగా సంభవిస్తుండేవి. ఆనాడు వైద్యము ఈనాడున్నంత అభివృద్ధిలో లేదు ఆనాడు శిశు

మరణాలను అరికట్టుటకు నానాపాట్లు పడేవారు దేవతలకు, దయ్యాలకు పూజలందించారు వారు ఎన్నో మూఢనమ్మకాలను కలిగియుండినారు శిశువులకు కొన్నిరకాల పేర్లు పెట్టడము ద్వారా శిశు మరణాలను అరికట్టవచ్చునని ఆశించారు వేమన్న అని పేరు పెట్టడము వలన చేదువాడని వుచ్ఛరించడమువలన ఆయుర్దాయం పెరుగునని ఆశించారు రోశయ్య, రోశన్న అను పేరును కూడ అందరూ రోశిన వాడని పిలువడమువలన శిశువు మరణానికి అతీతుడు కాగలడని ఆశించారు అటువంటి పేర్లే ముసలయ్య, బత్కయ్య కూడ అందరూ బత్కయ్య అని పిలువడము వలన చాలాకాలము బ్రతకగలడని, ముసలయ్య అని పిలువబడడము వలన ముసలితనము వచ్చు వరకు బ్రతకగలడని వారి నమ్మకము

రాయలసీమలో యీనాటికి యీ పేర్లు ఎక్కువగా పెట్టుకుంటుంటారు మన కవి వేమన పేరు కూడా చేదువాడని, మూర్ఖుడని, దుర్మార్గుడని, గుణహీనుడని, తెలివి లేనివాడు అను హీనగుణమును తెలియజేయుటకు పెట్టినదే యీ విధముగా దూషణకు గురియైనవాడు అధిక కాలము జీవిస్తాడు అను నమ్మకమువలననే యీ పేర్లు వాడబడుచున్నవి

"విశ్వదాభిరామ వినురవేమ" అను ముకుటతో వేల పద్యములు రచించినాడు వేమన నేను యీ మకుటానికి సరియైన వివరణను కనుగొనదలచి యీ మకుటాన్ని వేల పర్యాయములు వుచ్ఛరించాను విశ్వదాభిరామ ' వినురా రామా అంటూ పల్కడము సరియైనదని భావించాను విశ్వదాభిరామ వినుర వేమా, అన్నపుడు వేమా అనునది రామునికే వర్తిస్తుందను నిర్ణయానికి వచ్చాను రాముడు వేముడు యెలా అవుతాడని ఆలోచించాను. అప్పుడు యిది నాకు చిక్కుముడిగా తోచింది యీ చిక్కుముడిని విడదీయుటకు నానాపాట్లు పడ్డాను

*కుడియెడమల కీర్తిగన్న గువ్వలచెన్నా*
*కాకోదర కుందవరపు కవిచౌడప్పా.* అనుమకుటాలను పరిశీలించాను.

చెన్నడు, చౌడప్ప అనునవి నామవాచకములేగాని వాటికి అర్థాలు లేవు కాని శతకకర్తలు వారిపేర్లనే చివర వాడినారనునది మన మనస్సులలో నాటుకొనియున్నది అట్లాగే వేమన కూడ తన పేరును చివరన వాడినట్లు వూహిస్తూ వచ్చాము. కాని వేమన తనపేరుకు వున్న గుణమును (అర్థమును) తన మకుటము చివరన వాడినాడు కాని తనపేరును కాదు

*విశ్వదాభిరామ వినుర"రామా"*
*విశ్వదాభిరామ వినుర"వేమ"*
*విశ్వదాభిరామ వినుర"వేము",*

వేమ, వేమూ రెండు పదములు ఒకే అర్థమును (చేదు) యిచ్చును "విశ్వదాభిరామ వినురవేము" అనియుంటె మనకు సులభముగా అర్థమయ్యేది వేము-చేదు గుణమును సూచిస్తుంది కాన రాముడే వేముడని సులభముగా గ్రహించగలిగేవారము కొన్ని కారణాలవల్ల రాముడు వేముడని చెప్పటకు నిర్ణయించుకున్నాడు వేమన

**కనకమృగము భువిని కలదు లేదనకయె,**

**తరునివిడిచిపోయే దాశరథియు, తెలివిలేనివాడు దేవుడెట్లాయెరా.** అన్న వేమనకు శ్రీరామునకే తన బోధనలను వినిపించవలయునని కోరిక జనించి యీ మకుటాన్ని అల్లియున్నాడని అర్థమగుచున్నది

**విశ్వదాభిరామ వినురవేమ:**

విశ్వదాభిరామ=విశ్వప్రజలందరిచేత అభిమానించబడిన రామా; వినుర= వినుము, వేమా=విషహృదము కలవాడ, వేము కాన వేమన తన బోధనలనన్నింటిని రామునికే వినరా అంటూ రాముని అల్పునిగా భావించి తన సందేశమును బోధించినట్లు తేటతెల్లముగా, విశదముగా అర్థమగుచున్నది

రాముడు రామాయణములో కథానాయకుడే కాని దేవుడుకాదు. రాముడే దేవుడైతే సీతను రావణుడు ఎత్తుకోపోవడము జరిగియుండే దికాదు పాతివ్రత్యానికి మహిమ కలిగినచో సీత రావణునిచేత లంకకు ఎత్తుకపోబడేది కాదు రామాయణాన్ని జిజ్ఞాసతో చదివినచో రాముని పాత్ర పవిత్రమైనదేమికాదు దేవతలకు దివ్యదృష్టి కలదంటారు మరి రాముడు దేవుడైతే సీతను రావణుడు ఎత్తుకొనిపోవడము దివ్యదృష్టితో గ్రహించి వుండవచ్చును గదా! అందువలననే వినురా నా బోధ అంటూ వేమన రాముని అజ్ఞాపించినాడు, ఉత్తరువు చేసినాడు ఆదేశించినాడు వినురా అంటూ సంబోధించినాడు కాని వినుము అంటూ సంబోధించలేదు

వేమన మకుటములో దాగియున్న అర్థమును అర్థమగునట్లు వివరించాన నుకుంటాను నా యీ వివరణ పండిత పామరులందరు ఆమోదించగలరని నా నమ్మకము ఇది అందరి ఆమోదాన్ని పొందినచో యింతకాలము చిక్కుముడిగా యుండిన చిక్కును విప్పినవాడుగా నా జన్మలో వేమన రుణాన్ని తీర్చుకున్నవాడినౌతాను.

ఎందుకంటె! కలియుగంబుననున్న, కాపుకులానికి వేమ తన కీర్తి విక్రయించె అన్నాడు వేమన అంటే కాపులు శూద్రులు కాని వారందరకు వేమన తన ఆశయాలను ప్రతిఫలము ఆశించకయే బోధించినాడు స్వకులస్థులైన కాపులు శూద్రులు అయన కీర్తిలో పాలుపంచుకోవలెనన్న దానికి విలువను చెల్లించాలి. అంటే అయన ఆశయాలకు అనుగుణంగా నడచుకోవాలి

నా యీ వివరణ ఆమోదయోగ్యమైనది అయినచో నేను శూద్రుడుగా కాపుగా ఆయన రునాన్ని తీర్చుకున్నవాడనౌతాను

పాఠశాలలలో ఉపాధ్యాయులు కూడ ఆమోదించి నా యీ విపులీకరణను బాలురకు బోధించగలరని ఆశిస్తా జాతి కానివాడె జగముల దేవుండు, నిర్మలాత్మయొకటె నిజమైన దేవుండు, "పాయరాని శివుడు ప్రాణియై యుండంగ, ధర్మమే తనపాలి దైవము, గుడి దేహము, ఆత్మ దేవుడు" అంటూ దేవునిపై తన నిర్వచనము ప్రకటించాడు వేమన

మానవులు మాటలు నేర్చినప్పటినుండి యీ ప్రకృతిని గురించి చర్చించడము ప్రారంభించినారు యీ సృష్టికి మూలము ఏది ఈ ప్రకృతిని యిలా నడిపిస్తున్నది ఏది? ఏదో తమకు తెలియని శక్తి నడిపిస్తుందన్నారు కొందరు వారినే భావవాదులన్నారు భావవాదులే ఆ శక్తికి దైవము అని పేరిడినారు ఆదినుండి భావవాదులదే పైచేయి అవుతూ వస్తూంది యీ ప్రకృతి ప్రతి నిత్యము యిలానే నడుస్తుంది యిది ప్రకృతము అన్నారు కొందరు వీరినే పదార్థవాదులు, హేతువాదులు అన్నారు పై రెండు వాదాలను తిరస్కరించినవారిని 'అజ్ఞేయవాదులు' అంటారు వీరు దేవుడున్నాడన్నా లేడన్నా అంగీకరించరు ఏది ఎంతవరకు చూస్తారో అంతవరకే అంగీకరిస్తారు లేడు వున్నాడను చర్చ అనవసర చర్చ అంటారు అజ్ఞేయవాదాన్ని విస్తృతముగా ప్రచారము చేసిన వారు ఎడ్వర్డు గ్రీన్ యంగరుపోల్, అమెరికా దేశస్థుడు

భాష వుదయించిన తరువాత, దేవుడు వుదయించడము, దేవుడు వుదయించిన తరువాత మతములు వుదయించడము జరిగినవి మతములు పుట్టకముందు మనుష్యులందరు ఒకేజాతి అది మానవజాతి క్రీ పూ 500 సం॥ ప్రాంతములో బౌద్ధ, జైన, కన్ఫ్యూ, యస్ మతాలు, క్రీస్తుతో ప్రారంభమైన క్రైస్తవమతం 14 వందల సం॥ల వాడు పుట్టిన యిస్లాం మతములను జీర్ణించుకున్న వేమన తల్లి, బామ్మ గుడ్డు పరికించి చూడగా అన్న వేమన కులమతాతీత మానవ సమాజస్థాపనకై కృషిచేశాడు ఏనాటికైన మతాతీత మానవ సమాజం ఏర్పాటుకాక తప్పదు

<u>జై మతాతీత విశ్వమానవాళికి జై</u>

ఊ ఊ ఊ

# వేమన ఆయన తత్త్వము

1. శ్రీకరంబగు వేమన జెప్పినట్టి
పద్యముల నెవ్వడేనియు పఠనసేయు
అట్టి పురుషుడు మనమున నిట్టిదనుచు
జెప్పరా నట్టి వస్తువు జేరువేమ.

సర్వజనుల సుఖాన్ని కోరి ఎవరైతే వేమన పద్యములు పఠన చేయుదురో అట్టి పురుషులు తమ మనస్సులో వూహించరానంతగా వున్నతు లగుదురు – వేమన బోధనలను అర్థముచేసుకుని అచరించిన పాఠకులు సమాజములో గౌరవ నీయులగుటయే కాక మన సమాజాన్ని ఉన్నతమైనదిగా తీర్చిదిద్దిన వారౌతారు

2. అవును వేమన్న జెప్పిన యాత్మ బుద్ధి
తెలియలేనట్టి యజ్ఞానదేబెల్లి
తలకు బాసిన వెంట్రుక వలెను జూడ
భుక్తిముక్తులు హీనమైపోవు వేమ.

వేమన సూచించిన విధముగా ఆత్మజ్ఞానము పొందలేని మూర్ఖులు, తేటతెల్లముగా సూటిగా అర్థాన్నిచ్చే వేమన బోధనలను గ్రహించలేని వారు వేమన బోధనలను నిర్లక్షము చేసిన వారు తమ జీవిత భవిష్యత్తు తమ పోకడలపైననే అధారపడి వుంటుంధన్న సత్యాన్ని తెలుసుకోలేరు బ్రతుకుటకు కూడ యోగ్యులు కాలేరు అక్షర సత్యాలైన వేమన ఉపదేశాన్ని పాఠించి ధన్యులు కానవలెను

3 యెంత కడుగ నోటి యెంగిలిపోవునా
యనృతమునిడు నోరుయదియు నోరు
యనుదినంబు చూడ నవృతమాడెటి నోరు
నోరుకాదది కింది నోరువేమా.

నోటినుండి యెంగిలిని వేరుచేయలేము అది ఒక వూటి చెలిమెలాంటిది ఆ నోటనే అమృతము త్రాగగలము అనృతము ఆడగలము యీ పద్యము సత్యాన్వేషణకు పురికొల్పుతుంది ఏది సత్యము ఏది అసత్యము అనునది పరిశోధింప చేస్తుంది యజ్ఞయాగాదులలో చదివే వేద మంత్రాలకు

మహిమలున్నాయా? వ్రతాలాచరించే సమయములో అయ్యవారల నోటినుండి వెలువడే మంత్రాలు ప్రయోజనాన్ని యివ్వగలవా? శిల్పి చెక్కిన శిలను మంత్రోచ్చారణ చేసి ప్రతిష్ఠిస్తే ఆ విగ్రహములో శక్తి ప్రవేసిస్తుందా? కాన తమ నోట ఉచ్చరించే మంత్రాలకు మహిమలు కలవని బ్రాహ్మణులు రుజువు చేయవలసి వుంటుంది పురాతన కాలమునుండి వారి యెదుట ఒక ప్రశ్న నిలిచి వుంది అది మంత్రాలతో చింతకాయలు రాల్చగలరా? అని చింతకాయలను రాల్చి తమ మంత్ర మహిమను ఋజువు చేసుకోవలసిన బాధ్యత వారిపై వున్నది లేదా మహిమలు లేని మంత్రాలను పవిత్రమైన నోటితో వల్లించడమైనా మానుకోవాలి అలా రుజువు చేయనిచో అటువంటి నోరు మల విసర్జనము చేయు గుదముతో సమానమంటాడు వేమన కాన సత్యాన్ని సత్యంగాను అసత్యాన్ని అసత్యంగాను తెలుసుకున్నావాడే జ్ఞాని అవుతాడు - మంత్రశక్తిని ఋజువు చేయగలిగితే మనమే కాదు అట్టి వారిని ప్రపంచ ప్రజలందరు పూజించగలరు తరిగిపోని ఆశక్తితో ప్రపంచ ప్రజలందరను సుఖింప జేయవచ్చు, మరొక విషయం ప్రతిష్టించిన తరువాత విగ్రహానికి సర్వశక్తులు సమకూరుతాయంటారు మరి మహమ్మదీయులు విగ్రహాలను ముక్కలు చేసి విగ్రహాల క్రిందున్న ధనరాసులను ఎత్తుక పోతూ వుంటె మహిమలు ఏమైనాయి యిటువంటివన్ని యీనాడు సామాన్య జనములో ఉదయిస్తున్న ప్రశ్నలు ప్రశ్నించిన వారిని నిందించినంత మాత్రాన సమస్య పరిష్కారము కాదు మహిమలు లేని మంత్రాలను వల్లించి నోటిని అపవిత్రం చేసికోవద్దు అబద్ధమాడిన వానిని "నీవు నోటితో మాట్లాడుతున్నావా గుద్దతో మాట్లాడుతున్నావా అని గద్దించి ప్రశ్నిస్తుంటారు రాయలసీమలో యిది కూడ వేమన నుండి అందుకున్న సందేశమేమో

> *వినియు వినకయుండు వెర్రివాడైయుండు*
> *కనియు కానకుండు కడగి యోగి*
> *మనుజవరులచేత మరి పూజగొనుచుండు* ॥వి॥

వెర్రివాడుగా వినియు వివనట్లే అగుపడుతాడు చూచియు చూడనట్లే అగుపడుతాడు - కాని వింటున్నాడు చూస్తున్నాడు అందువలననే ప్రజలందరిచేత పూజింపబడుచున్నాడు అందువలననే స్పష్టంగా బోధపడే ఆయన హిత బోధనలను అందరూ ఆమోదించారు

4. ***కూటికిలేనివానివలె కోపము లేకను యెల్ల తావులన్***
***మాటికి మాటికిన్ మరియు మాటకు మాటకు పద్య పద్ధతిన్***
***దాటిమెరుంగ జెప్పుచును దారునిలో శివరూప దారి యై***
***మాటకి నున్న వేమన సమానము యెవ్వరు వెర్రి వేమనా***

అన్ని తావులలో అన్ని సమయములలో కూటికి లేని కటిక దరిద్రుడుగా అగుపడుతాడు ఆ శాంత మూర్తి వేమన ప్రశ్నించేవారు అధికమైనచో ఉగ్రరూపము దాల్చిన శివుని వలె ఏకధాటిగా పద్యములలో అర్థమయ్యే విధముగా సమాధానము చెప్పగలడు అటువంటి వేమన మాటకు యీ లోకములో సమానులు లేరు అయనకు అయనే సమానుడు విశ్వమానవుడు వేమన

5. వేముడిట్లు చెప్పవేం పద్యంబులు
తప్పులెన్నియైన నొప్పియుండు
తత్తరపడకందు చిత్తంబు నిలుపుము ॥వి॥

వేమన యీ విధముగా వేల పద్యములు చెప్పియున్నాడు ఏవైన తప్పులు వుండవచ్చునని అయనే అన్నాడు అయితే తొందర పడక మరి మరి చదివి మనస్సు నిలుకడ చేసుకొని ఆలోచించుకోవలసినదని మనవి చేసుకున్నాడు

6. వేయి విధముల మర వేమన పద్యంబు
అర్థమిచ్చు వాని నరసినంత
చూడచూడగలుగు చోద్యమౌజ్ఞానంబు ॥వి॥

వేమన పద్యములు పలు విధాల అర్థమిచ్చును వానిని పలుమార్లు చదివి అర్థము చేసుకోగలరని మనవి యీ పద్యములు చదువగా చదువగా వింతైనా పలు విధాల అర్థాలు బయటపడగలవు. పద్యము చిన్నదైనా అర్థము చాలా యిమిడి వుంటుంది

7. వేమన యోగి వెలసె లోకములోన
పూజలందుడు పుణ్య పురుషులారా
పూజలిడిన యంత భుక్తి ముక్తులనిచ్చు ॥వి॥

యీ లోకములో వేమన యను జ్ఞాని వెలసియున్నాడు – అయన బోధనలను అర్థము చేసుకుని ఆచరణలో యుంచువారు తమకే కాక ఇతరులకు మేలు చేసినవారౌతారు వేమన బోధనలను ఆచరించినవారు జీవించుటకు సులభమార్గమును తెలుసుకోగలరు అన్ని కష్టాల నుండి దరిజేరుటకు వేమన మార్గము తోడ్పడగలదు జ్ఞాన మార్గమును తేటతెల్లముగా బోధించినాడు వేమన చూపించిన మార్గమునకు మరొకటి దీటురాదు.

8. ఇలను శూద్రుడౌట యెరుగురా వేముని
మనసు అతనియందు మరలుగొనియె
కొలిచిరి విప్రులు కోటాన కోటులై ॥వి॥

దేశములో వేమన శూద్రుడు అని యెరుగని వారుండరు కాని వేమన బోధనలు అన్ని కులాలవారిని, అన్ని వర్ణాల వారిని ఆకర్షించాయి ఎందరో బ్రాహ్మణులు కూడ వేమన బోధనలను విని ఆయనను అనుసరించినారు కోట్లాదిగా ప్రజలు జాతి, మత, వర్ణ, వర్గ, లింగ భేదము లేక ఆయనను అనుసరించారు

*9. నీతి తెలియజెప్ప నిజముగ వేమన*
*పాతకముల నెల్ల పారబట్టి*
*లోతుతత్వ మరసి లోకులకును జెప్పె* *//వి//*

అవినీతి కార్యక్రమాలన్నియును ప్రజలకు వివరముగా తెల్పి నీతి కార్యములను వివరించి చెప్పియున్నాడు నీతి- అవినీతులు బోధించుటకు ఆయన నీతి-అవినీతుల తత్వమును (సత్యం తెలుసుకుని) పూర్తిగా గ్రహించి తెలియజేశాడు

*10. వేద విద్య లెల్ల వేశ్యల వంటివి*
*భ్రమలబెట్టు తేటపడగ నీవు*
*గుప్తవిద్య యొకటె కుల కాంత వంటిది* *//వి//*

వేదములు వేశ్యల లాగ భ్రమలు కలుగజేస్తాయి కాని వేశ్యల కపట ప్రేమ లాగ వుండును వేదార్థాలు. వేదాలు నిజమైన అర్థాన్ని యివ్వవు వేదాలు మానవులు జీవించుటకు ఏ విద్యను బోధించవు ఒక కొత్త విద్యను నేర్చుకో, అని దాగిన విద్యను పరిశోధించమని వేమన పరిశోధన వైపు మల్లిస్తాడు యితరులకు తెలియని విద్యను నేర్వమన్నాడు.

*11. వేదములను చదివి వెర వేమి గాంచిరి*
*తిరిగి తిరిగి వత్తురందరిండ్లు*
*బ్రహ్మ మహిమ తెలిసి బ్రతుకుట నిజమయా* *//వి//*

బ్రాహ్మణులు వేదాలు వల్లిస్తూ అందరిండ్లు తిరిగి యాచిస్తుంటారు యీ వేదాలు నేర్చుకున్నందుకు ప్రయోజనము యాచించడము నీచము కాదా? బ్రహ్మ మహిమ=ఉత్పత్తి(సృష్టించు)చేయు మార్గము శ్రమచేసి ఉత్పత్తిలో పాల్గొని వుత్పత్తి చేయడము నేర్వాలి అదే నిజమైన జీవిత విధానము బ్రహ్మజ్ఞానము అనగా సృష్టించే జ్ఞానము వుత్పత్తిలో పాల్గొనని వారు సాంఘిక నేరస్తులన్నాడు మహాత్మా గాంధి ఏ ప్రయోజనము యివ్వని వేద పఠనము చేయువారు సంఘములో నేరస్తులే నేరస్త జాతి నిర్మూలనమే జాతికి గౌరవము

12 వేదశాస్త్రములను విరివిగా తానేర్చి
వాదమాడువాడు వట్టివాడు
సారమైన గురుతు సాక్షిగా నెంచుము ॥వి॥

ఫలితాన్ని యిచ్చునదియే శాస్త్రము బ్రాహ్మణులు అందరు వేదశాస్త్రమును చదివి తర్కవాదము చేయుచుందురు తర్కవాదము వారికి ఏమి ప్రయోజనము యివ్వగలదు వేదములను వల్లించడము వలన కలిగిన ఫలితాన్ని వారు ఋజువు చేయగలరా? కాన వేదసాస్త్రము ప్రయోజనము లేనిదని ప్రజలు గ్రహించగలరు

13. వేనవేలు చేరి వెర్రి కుక్కల వలె
అర్థహీన వేదమరచుచుండ్రు
కంఠశోష కంటె కలిగెడు ఫలమేమి? ॥వి॥

బ్రాహ్మణులు గుంపులు గుంపులుగా చేరి అర్థములేనటువంటి వేదములను పిచ్చికుక్కల వలె మొరుగుతుంటారు యిట్టివారికి పరనము గొంతు నెప్పి కలుగజేస్తుంది కాని ప్రజలకు ఏవిధమైన ఫలితాన్ని లేదు ఫలితము గొంతు నొప్పి మాత్రమే వారికి

యాగము చేసిన విప్రుడు
భోగించును రంభతోడ తనయుడు మరలన్
యాగంబు జేయ తల్లిని భోగించుటకాదె వేమా యజ్ఞ పుణ్యము

యాగము చేసి తండ్రి స్వర్గములో రంభతో సంభోగము చేయుచుండగానె అతని కుమారుడు కూడా యాగము చేసి స్వర్గమునకు పోయి రంభతో సంభోగము చేయడము తల్లితో సంభోగించడము కాదా! యజ్ఞపుణ్యము వలన తల్లితో భోగించు ప్రాప్తము కలుగుతుంది తనయునకు దీనికి సమాధానము యజ్ఞాలు చేయిస్తున్న బ్రాహ్మణులే చెప్పాలి.

14. కాదన డెవ్వరి తోడను
వాదాడగ వెర్రివాని విధమునన్
భేదా భేద మెరుంగును
వేదాంత రహస్యములను వేమన యెరుగున్.

వేదాంత రహాశ్యములను తెలిసి కూడ వేమన పిచ్చివాడిలాగా ఎవరితో నంటె వారితో వాదించుటకు యిష్టపడడు – ఏమీ తెలియని వారికి తెలియజెప్పడము కష్టమన్న సంగతి వేమనకు తెలియును వేమన జ్ఞాని అయనకు తెలియని దేది లేదు.

15. చదివి చదివి కర్మసారము గనలేక
తిరిగి తిరిగి తిరిగి దిమ్మరాయె
మరిగి తిరిగి మొరిగి మత్తిల్లి చచ్చెరా ॥వి॥

చదువు చదివి కూడా శ్రమయొక్క విలువను పవిత్రతను గ్రహించ లేక తిరిగి తిరిగి తిరిగుబోతుగా మారిపోతారు చదువుకున్న వారు శ్రమపడి ఏదైన వుత్పత్తి చేయడము నేర్చాలి లేనిచో తిరుగ మరిగి సోమరులై మతిజెడి చస్తారు

16. వెర్రికుక్కల వలె వేదముల్ జదివేరు
ఆశయంబు లెరుగరయ్య వార్లు
వేదసారమంత వేమన యెరుగును ॥వి॥

వేమన వేదసారమును తెలుసుకొన కోరి పలుమార్లు చదివి అందులో దాగియున్నది ఏదియు లేదని విపులంగా తెలుసుకున్నాడు యే ఆశయము లేకయే బిగ్గరగా మొరుగుతుంటాయి కుక్కలు అట్లాగే అయ్యావారలు యే ఆశయములేకయే బిగ్గరగా వేదాలను వల్లిస్తుంటారు ఆశయము లేక వేదాలను బిగ్గరగా వల్లించే బ్రాహ్మణులను తిక్క కుక్కలతో పోల్చాడు వేమన

17. బ్రాహ్మణుల మటంద్రు బ్రహ్మత్వమదిలే ని
బ్రహ్మమద్దియేల? బ్రాహ్మణుడటె
బొమ్మవలెను తాను దిమ్మపై కూర్చుండ ॥వి॥

బ్రహ్మత్వము=ఉత్పాదనా శక్తి బ్రాహ్మణులము అంటారు కాని వారిలో వుత్పాదనా శక్తి యుండదు. వుత్పాదనా శక్తి లేని బ్రాహ్మణత్వము ఎందుకు? తాను అధిక కులస్థుడనని వున్నతాసనమున కూర్చున్నంత మాత్రాన వుత్పాదనా శక్తి అతనికి రాదు కాన బ్రాహ్మణుడు కాలేడు వేమన చేతివృత్తుల వారిని రైతాంగాన్ని గొప్ప కులస్థులుగా భావించి గౌరవించవలెనని మనవి చేస్తాడు

18 మంత్రమొకటి జెప్పి మరి దేవతార్చన
జేసి కరుణ తమకు చెందినదని
వేదపఠనజేసి వెర్రులైపోదురు ॥వి॥

దేవుని యెదుట వేదములను చదివి దేవతార్చన కూడ జరిపి తమను దేవుడు కరుణించాడు అని చెప్పే వేద పారకులు వెర్రివారే దేవుడు కరుణించాడని ఏవిధముగా గ్రహించారు దేవుడు తాము చదివిన వేదములు విన్నాడనుటకు నిదర్శనాలు ఎక్కడున్నవి యిటువంటి వూహాలన్నియు వెర్రి భ్రమలే యీ తంతు అంగము భ్రమలు కలుగజేసి తోటివారిని దోచుకొనుటకే

19. సోమయాజులు మనుచు సోలు కొందరు
త్రాగు నేల తామె చేవటంద్రు
క్రతుఫలంబు కంఠ గతమగు కాబోలు ॥వి॥

యజ్ఞ క్రతువును నిర్వహించెవారిని సోమయాజులు అంటారు యజ్ఞము జరుగుచున్న సమయములో వీరు అధికముగా సారాను సేవిస్తుంటారు.యజ్ఞము జరుగుచున్న సమయములో అధికముగా త్రాగుటకు అర్హులమంటారు యజ్ఞ ఫలితము సోమయాజులు అధికముగా త్రాగుటకే కాబోలు అంటాడు వేమన యజ్ఞము వలన ఫలితాలు ఏమివుండవు కాని బ్రాహ్మలు పీకల వరకు తాగి తినుటకు జరిపించె ఒక తంతు మాత్రమే

20. సోమయాజి ననుచు సొంపుగా వేషంబు
గట్టి మాంస మెల్లగాల్చి తినును
త్విజుడాతనన అధిక ఫలమేమి గల్గును ॥వి॥

యజ్ఞ కాలములో సోమయాజులు ప్రత్యేకమైన దుస్తులు ధరిస్తారు యితరులకు ప్రత్యేకముగా అగుపడుటకు ప్రత్యేకమైన ఆభరణాలను కూడా ధరిస్తారు కాల్చిన గట్టి మాంసమును తింటారు తాము బ్రాహ్మలమని చెప్పుకుంటారు యిది ఎంత వైపరీత్యము జనులు వీరిని ఏవిధముగా అర్థము చేసుకోవాలో ఆలోచించండి?

21. తల్లి యూర్వశి లంజ తనమాలు మాదిగ
తాను బ్రాహ్మణుడనుట తగునె జగతి
వాసిష్ఠ కులమును వసుధలో నెరుగరా ॥వి॥

వసిష్ఠుని తల్లి వేశ్య (ఊర్వశి) అతని భార్య మాతంగముని కుమార్తె (మాదిగ) అరుంధతి యిటువంటి చుట్టరికాలు కలిగిన వశిష్ఠుడు బ్రాహ్మణోత్తముడు ఎట్లైనాడు యీ లోకములో వాసిష్ఠ కులమును తెలియని వారెవరున్నారు కావన అంటరాని తనము ఆ రోజులలో లేదని భావించవచ్చు. దీనికి ఏమి సమాధానము చెప్తారో మన బ్రాహ్మణోత్తములు

22. విప్రులెల్లగూడి వెర్రి కూతలు గూసి
సతిపతులను గూర్చి సమ్మతమున
మును ముహూర్తముంచ ముండెట్లు మోసెరా ॥వి॥

బ్రాహ్మలు (జ్యోతిష్యులు) అందరూ కూడి విపులముగా చర్చించి వధూవరుల జాతకములను పరిశీలించి సమ్మతపడి వివాహము చేస్తారు. కాని వరుడు మరణించి వధువు విధవరాలైపోతుంది. మరి జ్యోతిష్యము

అబద్ధము అయినట్లే కదా! యిటువంటి శాస్త్ర సమ్మతాలు కాని వాటిని యీ దినమువరకు నమ్మించడము మోసముకాదా? ఆలోచించండి

23. *విశ్వము నడుపంగ విశ్వేరుడుండ*
*బ్రాహ్మణులకు నేల పట్టుదలలు*
*వనములోని కోతి వసుమతి నడుపునా?* ॥వే॥

బ్రాహ్మలు తమ వలననే యీ లోకము నడిపించబడుతుందని, తాము భూలోక దేవతలమని చెప్పుకుంటుంటారు వనములో యున్న కోతి కూడా యీలోకమును నడిపించగలదా? లేదు యీ బ్రాహ్మలే "మంత్రాదీనం జగత్ సర్వం, మంత్రాదీనంతుదైవతం తన్మంత్రం బ్రాహ్మవాదీనం బ్రాహ్మ నోమమ దేవతాం" (యిది ఎవరు ఏకాలంలో చెప్పియున్నారో) యీ జగత్తు (విశ్వము) మంత్రానికి లోబడి యున్నది ఆ మంత్రం బ్రాహ్మణుని అధీనములో యున్నది. కాన బ్రాహ్మడే దైవము యిది వారి అహంభావానికి నిదర్శనం ఏది రుజువు చేయలేరు వారి హృదయాలు అబద్ధాలకు పుట్టినిండ్లు

24. *ఉదయమందు శూద్రు డుత్తమోత్తము డెట్లు*
*సతికి శూద్ర తనము సత్యమె గదా!*
*తల్లి శూద్రయాయె తానెట్లు బాపడా?* ॥వే॥

బ్రాహ్మణ స్త్రీలకు జందియము లేదు కాన బ్రాహ్మణ స్త్రీలందరు శూద్రులే తల్లి శూద్రురాలైనపుడు అట్టి స్త్రీకి జన్మించినవాడు బ్రాహ్మణుడెట్లు కాగలడు జన్మించగానే బ్రాహ్మడు కాలేడు అంటాడు వేమన

25. *జీవిజీవి జంపి జీవికి వేయగా*
*జీవితాన బలిసి చెలగుచుండు*
*జీవహింసలకును చిక్కునా మోక్షంబు* ॥వే॥

యజ్ఞము చేయు బ్రాహ్మలు యజ్ఞ జంతువును చంపి ఆ మాంసమును భుజించి మదించి (వేయగా అను పదమును వాడి యున్నాడు కాన తిన్నవారివి నక్కలు కుక్కలతో పోల్చినారు) తిన్న బ్రాహ్మణులు కోడెల లాగ బలుపెక్కిన సంఘవిద్రోహ పనులు చేయువారికి మోక్షము లభిస్తుందా? (ఎద్దు కొమ్ములతో పొడవటము కొమ్ముతో చెలగింది అంటాతు) యిటువంటి హింసాకార్యము చేయడమువలన మోక్షము ఎలా ప్రాప్తమౌతుందంటాడు వేమన

*వడుగు ద్విజుల కెల్ల కడు ముఖ్యమందురు.*
*వడుగు జేసెదమని వదరుకొనుచు*
*కడుగు తాగిన కాకి కర్రుకర్రన్నట్లు* ॥వే॥

26. హింసజేయకుండుటయే ముఖ్య ధర్మంబు
యనక హింసజేతు రవని సురలు
చావుపసిని దినెడు చండాలుడే మేలు ||వి||

అహింసయే ముఖ్యధర్మమని తెలుసుకోలేని బ్రాహ్మలు యజ్ఞయాగాదులు చేస్తు జంతుబలులు కావిస్తుంటారు జంతువులను చంపి మాంసాన్ని బక్షించడమే కాక సారాయమనే మత్తు పదార్థాన్ని సేవిస్తారు బ్రతికిన జంతువులను చంపి తినె యీ బ్రాహ్మల కన్న చచ్చిన పశువులను తినే చండాలుడే నయం అంటాడు వేమన

27. బ్రహ్మ నృపతి, వైశ్యపతులను శూద్రులు
బ్రహ్మ విష్ణు హరులు పశువులెన్న
బ్రహ్మము తెలియకను బహురూపు లిట్లైరి ||వి||

సృష్టికి మూలమైన కారణాన్ని తెలుసుకోలేకయే ప్రజలు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులుగాను దేవతలు విష్ణువు, ఈశ్వర, బ్రహ్మ యను త్రిమూర్తులుగాను వెలశారు వీరందరు పశు సమానులె సృష్టికి మూలాన్ని తెలుసుకోలేక దేవతలు కూడా యిన్ని రూపాలు యెత్తినారు కాక సృష్టికి మూలమైన శక్తి ఒక్కటె ప్రజలందరు సమానులె అని వేమన తేల్చి చెప్పాడు

28. విప్రవరుల మనుచు వేదంబు జదువుచు
ప్రాకృతులను జూచి పరిహసించు
ధరని సురలకన్న దాసరి మతమెచ్చు ||వి||

బ్రాహ్మనులము అనుకొన్న వారిలో అహంకారము పూర్తిగా యున్నది. నాల్గు వర్ణాలలో తాము ప్రధములమని భావించడములోనె అహం పుట్టింది. వేదములు చదువుటకు కూడా తామే అర్హులము అనే అహం బ్రాహ్మలలో వుంది. బ్రాహ్మలు తమ ప్రయోజనాలను కాపాడుకొనుటకు వాటిలో ఏదో పవిత్రత వున్నదని ప్రచారము చేస్తున్నారు వేమన వేదాలు అర్థములేనటువంటివని తేల్చి చెప్పాడు తామె గొప్పవారమని తమకే వేద రహస్యం తెలియునని బ్రాహ్మలు గర్వపడుతుంటారు కాని బ్రాహ్మలలో కాని వేదాలలో గాని ఏ గొప్పతనము లేదు ఏ దాపరికము లేక అహంభావము లేక అ దేవుని ప్రార్థించే మాల దాసరులే యీ బ్రాహ్మల కన్న గొప్పవారు అన్నాడు వేమన.

29. మాదిగ శైవులను మనసులో బెట్టుక
మాదిగలను దెగడు మాదిగెపుడు
మంచి గుణము లేక మరి ద్విజుడెట్లగు ||వి||

మాదిగలను వీరశైవులను మనస్సులో యుంచుకొని మాదిగలంటూ దూషించె బ్రాహ్మణుడు కూడ మాదిగయే విశాల హృదయము లేని వాడు బ్రాహ్మణుడు కానేరడు

*30. పిండములను జేసి పితరుల దలపోసి*
*కాకులకు బెట్టు గాడ్దెలారా*
*పియ్యి తినెడి కాకి పితరుడెట్లాయెరా* ॥వి॥

అన్నము ముద్దలు చేసి ఆరుబయలులో పెట్టి తమ తాత ముత్తాతలను తలచుకుంటూ మా పెద్దలు వచ్చి తింటారని పెట్టిన ముద్దలను కాకులు తింటాయి తమ పితృదేవతలు కాకి రూపములో వచ్చి తిన్నారని ఆనందిస్తారు పెంట తినే కాకి మీ పిత్రుదేవత యెలా అయింది బుద్ధిలేని గాడిదలారా అని ప్రశ్నిస్తాడు వేమన

*31. తాడు మెడకు వేసి తనదు శూద్రత్వంబు*
*పోయెననుట యెల్ల బుద్ధి లేమి.*
*మది నిలుపక త్రాడు మరి వన్నె దెచ్చునా?* ॥వి॥

పుట్టుకతో ఉందరూ శూద్రులే కాని మెడకు త్రాడు (జంద్యంబు) వేసినంతనే అతని శూద్రత్వము పోయినదని బ్రాహ్మణుడయినాడని ఏ విధముగా రుజువుచేయగలరు. జందియము వేయడము వలన మనిషిలో మార్పు ఉత్తమ గుణము రాగలదా? రాదు

*కాకి పక్షులందు కడు హీనమందురు, కాకి పెండ్లి నెవరు కనరు భువిని*
*కాకికన్న ముంచి కాళ్లకు మొక్కేరు* ॥వి॥

పక్షులలో కాకి చాలా హీనమైనదని అంటారు కాకుల సంభోగము చూచినవారికి ఆపదలు రాగలవనే నమ్మకము ప్రజలలో వున్నది యిటువంటి కాకి కాళ్ల ముందు అన్నము ముద్దలు వుంచి తినమని మొక్కుతారు యిది ఎంత విడ్డూరము కాకి తినడము వలన తమ పెద్దలకు ఏ విధముగా చేరును

*32. తిరుమలకును బోవ తురక దాసరి గాడు*
*కాశికేగ పంది గజము గాదు*
*కుక్క సింహమగునె గోదావరికి బోవ* ॥వి॥

తిరుమల తిరుపతి పవిత్రమైన స్థలము అంటారు కాని తిరుపతికిపోయిన తురకను విష్ణుభక్తుడుగా మార్చలేదు గదా ఆ స్థల మహోత్యము ఏమైనది గంగా పవిత్ర జలాలలో మునిగిన పందిలో ఏ మార్పులు చూడలేము

అట్లాగే గోదావరిలో మునిగిన (యీదిన) కుక్కలో కూడా ఏ మార్పురాదు పుణ్య తీర్థాలని, పుణ్యక్షేత్రాలని చెప్పేవన్నియు శుద్ధ అబద్ధాలే. యివి బ్రాహ్మలు తమ సుఖమైన జీవనాధారానికి చేసుకున్న ఏర్పాట్లు ఎందులోను నిజము లేదు

33. తోలు కడుపులోన దొడ్డవాడుండంగ
రాతిగుళ్ల కేల రాసిపోయ
రాయి దేవుడైన రాసులు మ్రింగదా ॥వి॥

వీలోనె మెదడు జ్ఞానము ఉన్నవి అదియే గొప్ప దేవుడు. అన్ని జీవులలో నున్నది ఆ పరమాత్మ అని తెలుసుకో తెలియక రాతి విగ్రహాలముందు అన్నము రాసులు పోసి ఎందుకు మొక్కడము ఆ రాయియే దేవుడైతే ఆ విగ్రహానికే ఆకలియుంటె ఎన్నిరాసుల అన్నానైనా మింగగలదు ఆ ఆకలి తీర్చడము ఎవరి వలన కాదు యీ తతంగమంతా పూజారులు భ్రమలు గొలిపి చేయిస్తున్నదే

34. గట్టురాళ్లు తెచ్చి కాలుసేతులు జెక్కి
కాసె వులుల చేత గాసి చేసి
మొరపు రాళ్ళ కెరగు మొప్పెలనేమందు ॥వి॥

కొండనుండి బండరాళ్ళను తెచ్చి ఆ రాతిపైన ఎక్కి తొక్కి శిల్పి ఒక ఆకారాన్ని (రూపాన్ని) ఉక్కు ఉలులను వుపయోగించి చేస్తాడు. ఆ రాయి చరిత్రను తెలుసుకోలేని మూర్ఖులు పోయి వాటిని పూజిస్తారు అట్టివారినేమనాలి అని వాపోతాడు వేమన

35. రాతి బొమ్మ కేల రంగైన వలువలు
గుళ్లుగోపురాలు కుంభములును
కూడుగుడ్డ తాను కోరునా దేవుండు ॥వి॥

రాతి బొమ్మలను ఖరీదైన రంగు రంగు వస్త్రాలతో అలంకరించడము ఎందుకు గుళ్ళు కట్టించమని, గోపుర్వాలు నిర్మించమని కూడుగుడ్డలకు లేక అలమటిస్తున్నానని అవియన్నియు కల్పించమని దేవుడు ఎవరిని కోరినాడు యిది అంతయు సామాన్యులను బ్రాహ్మలకు బానిసలుగా చేయుటకు పన్నుతున్న పన్నాగమే కాని వేరుకాదు దేవతల కోర్కెలను మానవులు తీర్చడము ఎంత వెర్రితనమో ఆలోచించండి దేవుడి బానిసలందరూ తమ బానిసలేనని బ్రాహ్మలకు తెలుసు వారు భూలోకములో దేవతలే గదా!

36. రాయిరూపు జేసి రాజుల మ్రొక్కింప
వన్నెకెక్కునటనే వైభవంబు.
కర్తయెవ్వడనుచు కానరు మూర్ఖులు ॥వి॥

పురోహితులు రాజులను ప్రోత్సహించి గుడులను కట్టించి శిల్పుల చేత చెక్కబడిన విగ్రహాలను అందులో నిలిపి రాజులచేత పూజలు చేయిస్తుంటారు పూజలు చేసినందుకు మాన్యాలను కూడా పొందుతారు ప్రజలను పీడించి గుళ్ళు గోపురాలు నిర్మించడము పౌరోహితులకు దానాలు చేయడము వలన ఆరాజ్యము పతనావస్థకు చేరుకుంటుంది దీనికంతయు మూలకారణము పూజారులేనని అజ్ఞానులైన ప్రజలు తెలుసుకోలేరు తెలుసుకునే అవకాశము కూడ వారికివ్వరు

*37. రాయియయ్యె రాయుడు భువిలోన*
*భక్తి మొక్కు వారు బండలె కదా*
*దేవునంతవారు భావింప భక్తులా* *॥వి॥*

బండరాయిని కొండనుండి తెచ్చి దేవతా విగ్రహముగా శిల్పుల చేత చేయిస్తారు ఆ బండ దేవుడై కూర్చుంటుంది ఆ బండలకు మ్రొక్కె వారు కూడా ఆ బండతో సమానులె ఆ బండలో ఏశక్తి లేదని అది పూర్వపు కొండరాయియేనని వూహించక మ్రొక్కుచుంటారు భక్తులు తాము చేయుచున్నది అజ్ఞానము వలన అని తెలుసుకొనుటకు కావలసిన జ్ఞానము వారిలో లేదు గదా అంటాడు వేమన

*38. ఒక్కపొద్దులున్న నూరపందైపుట్టు*
*పృదివి తపముసేయ పేదయగును*
*నిగిడి శిలకుమ్రొక్క నిర్జీవులవుదురు.* *॥వి॥*

అధికముగా తినే వారిని పందుల లాగ తింటారంటారు ఒక్క పొద్దులున్నవారు పందులలాగా అధికముగా తింటారు తపస్సుచేయు వారు ఆహార నియమాలు పాటించరు ఆహారాన్ని చాలా తగ్గిస్తారు దాని ఫలితముగా వారి శరీరము బలహీనమగును దేవుడు ప్రత్యక్షము కాని యెడల తాము దీక్షను విరమించబోమని దీక్ష పూనిన వారు మరణిస్తారు అని తేల్చి చెప్పారు వేమన

*39. చదివినతని కన్న చాకలయ్యే మేలు*
*కులము వేల్పుకన్న కుక్క మేలు.*
*సకల సురల కన్న జార భామిని మేలు* *॥వి॥*

చదివిన యతనికి ఏదైన వృత్తివిద్య తెలియడము అవసరము కేవలము చదువడము వ్రాయడము నేర్చుకున్న అతనికన్న వృత్తివిద్య నేర్చుకున్న చాకలియే మేలౌతాడు అతడు మురికి గుడ్డల మురికిని వదిలించి శుభ్రపరచగలడు యింటిని దొంగలు దోచుకుపోతువుంటె యింటి వేల్పు ఏమాత్రము

ఆటంకపరుచదు. కుక్క దొంగలను తరిమి కొట్టి యజమాని ఆస్తివి కాపాడుతుంది కాన కుక్క యింటి దేవతల కంటె మేలు సహాయము చేయ తలపెట్టినపుడు వేశ్యావృత్తిని అవలంబించే స్త్రీ కూడా సహాయ పడగలదు.

40. *పడివడి మ్రొక్కగ నేటికి*
*గుడిలోపం కరిన శిలల గుణములు చెడునా*
*గుడి దేహమాత్మ దేవుడు*
*చెడురాళ్లకు పట్టిపూజ సేయకు వేమా.* ॥వి॥

గుడిలోయున్న విగ్రహాల ముందు పడి దొర్లుతుంటారు కొందరు భక్తులు యీ భక్తిని సంగ్రహించేందుకు ఆ గుడిలో యున్న కరినశిలకు ప్రాణమేలేదు అది కటువైన రాయియే గదా! విగ్రహముగా మారిన ఆరాయి యిపుడు పూర్తిగా చెడిపోయినది యిల్లు వంతెనలాంటి ఏ నిర్మాణ మనకు పనికిరాదు. అటువంటి చెడు రాయికి పూజ చేసి నీవు ఏమి ప్రయోజనాన్ని పొందలేవు నీలోనె దాగియున్న శక్తిని తెలుసుకో అంటాడు వేమన

41. *నీళ్లమునుగనేల నిదుల మెట్టగనేల*
*మొనసి తీర్థములకు మ్రొక్కనేల?*
*కపట కల్మషములు కడుపులో నుండంగ* ॥వి॥

హృదయములో కపటము కల్మషము వుంచుకున్న వారు ఎన్ని పుణ్యక్షేత్రములను దర్శించినా ఎన్ని పవిత్ర నదులలో మునిగినా ఎందరు దేవతలను పూజించినా ఏమి ప్రయోజనాన్ని పొందలేరు పరులకు వుపకారము చేయడమే పుణ్యం పరులను పీడించడమే పాపమన్న సత్యాన్ని తెలుసుకోమన్నాడు వేమన

42. *భూములందు కొన్ని పుణ్యభూముల టంద్రు*
*బుద్ధిలేదె, యదియు భూమిగాదె*
*పుణ్యమనగ నేమి పురుషుని కర్మమే* ॥వి॥

భూమి యంతయు ఒకటె. కొన్ని పుణ్యభూములంటూ కొన్ని పాపపు భూములంటూ లేవు గుడి నిర్మించినదైన గృహము నిర్మించినదైనా, స్మశానమైనా అన్ని భూములే నీవుచేసిన వుపకారములు అపకారములను బట్టియే మంచి చెడులు నిర్ణయమౌను అంటాడు వేమన పురుషుడు చేసిన పరోపకార ఫలితమే పుణ్యము పరపీడనమే పాపము

43. *భూములందు కొన్ని పుణ్య భూములటంద్రు*
*నందు గల్గదేవుడిందు లేడె*
*యిందు నందు గలడు హృదయంబు లెస్సైన* ॥వి॥

భగవంతుడు విశ్వవ్యాప్తుడు చిలుకను పట్టి పంజరములో యుంచినట్లు దేవుని గుడిలో నిర్బంధించలేరు జ్ఞానులకు విశ్వమంతా వ్యాపించి యుంటాడు కొందరు స్వార్థపరులు తాము ప్రయోజనము పొందుటకు పుణ్యస్థలాలలో, పుణ్యనదులలో వుంటాడని ప్రచారము చేస్తుంటారు హృదయము పదిలమైన వారికి అన్ని స్థలములలో వుండు నంటాడు వేమన

44. *కాశికి చనువారి ఖర్మమే మనవచ్చు*
*చావహేతు వుండి చచ్చెనేని*
*మనసు కాశి జేరుమరి ముక్తి లేదురా* ॥వే॥

కాశికిపోవు భక్తుడు ఏకారణము చేతనైన మరణించినచో మనసు కాశి చేరుతుంది కాశికి చేరకయె భక్తుడు మరణించడము వలన భక్తునికి ముక్తి కలుగుతుందా? కాశిలోనె దేవుడున్నాడని ప్రయాణము చేసి మార్గమధ్యములో చావడము కోరి మరణాన్ని తెచ్చుకోవటమే అంటాడు వేమన

45. *మక్కాకు పోనేల మరి తిరిగి రానేల*
*ఏకమైన కర్త యెందులేడు*
*అన్నింట పరిపూర్ణుడల్లా మహమ్మదు* ॥వే॥

దేవుడి కొరకు మక్కా వరకు పోయి రావలయునా! దేవుడు ఎక్కడ లేడు విశ్వవ్యాప్తుడు దేవుడు అన్ని స్థలములలో సంపూర్ణముగా వున్నాడు అల్లా, మహమ్మదు

46. *ఇహము విడువఫలము యింపుగా కలదని*
*మహిని బలుకు వారి మతము కల్ల*
*యిహములోన పరము నెరుగుటగానరో* ॥వే॥

మరనానంతరము స్వర్గము చేరుకుంటారని చెప్పి భ్రమలు కల్పించె వారి మాటలు అబద్ధము స్వార్థపరులు పరలోకము కలదని నమ్మించి యితరులను మోసము చేస్తుంటారు యీ లోకములోనె నీవు వూహించిన పరలోకాన్ని కల్పించుకొని సుఖజీవితాన్ని పొందు మరణించిన తరువాత పరలోకము పోయి చూచి వచ్చినవారు ఎవరూ లేరు. అన్నాడు వేమన

47. *బ్రహ్మ జంపి విష్ణు భాగంబులో గల్పి*
*విష్ణుజంపి శివుని వెలయగల్పి*
*శివుని జంపి తాను శివయోగిగా వలె* ॥వే॥

యిప్పటివరకు ప్రజల మనస్సులలో స్థావరము ఏర్పరచుకున్న సృష్టికర్త బ్రహ్మను చంపి పోషణ కర్తయైన విష్ణువులో కలిపి, ఆ విష్ణువును బ్రహ్మను చంపి లయకారకుడైన శివునిలో కలిపి యీ ముగ్గురి శక్తిని చంపి జ్ఞానివై నీవు సర్వజ్ఞుడవని, సర్వశక్తి సంపన్నుడవని నీవే ఉత్తమ మానవుడనని తెలుసుకోమన్నాడు వేమన

*48. పేరు సోమయాజి పెను సింహ్మాబలుడయా*
*మేకపోతు బట్టి మెడలు విరుచు*
*జీవహింసకులకు చిక్కునా మోక్షంబు. ॥వి॥*

బ్రాహ్మణులలో యజ్ఞక్రతువును నిర్వహించువారిని సోమయాజుల ంటారు. వారు జంతువుల లాగా బలిసియుంటారు. వారు మేకపోతును పట్టి సులభంగా మెడ కొరికి చంపుతారు యజ్ఞ పశువును బలిచేయడం పూర్తి అవుతుంది. క్రతువును కారణముగా జూపి జంతుహింసకు పాలుపడినంత మాత్రాముననమోక్షము కలుగుతుందా? యీ తంతు అంతయు తామే తినుటకై చేస్తూ మోక్షసాధనకు చేస్తున్నామని యితరులకు చెప్తూ ఉంటారు

*49. పుట్టి శక్తులైదు పుడమినడింపంగ*
*విప్రులెల్ల వేదవేత్తలమని*
*శక్తిపుత్రు కులము జగతిలో నెరుగరో ॥వి॥*

పంచభూతములు యీ భూమిమీద సృష్టికి ఆధారములై యుండగా బ్రాహ్మణులు వేదపండితులమైన మావలననే యీ సృష్టి జరిగిందని చెప్పడము పచ్చి అబద్ధము యీ అసత్యవాదుల కూతలు ప్రజలకు తెలియవా! యీ విప్రులను తెలియని వారెవరున్నారంటాడు వేమన

*శివమతమునకైన వివరింపగా గుర్వు*
*హరిమతమున కైన నరయ గుర్వు*
*గురువు నెరుగలేని గుణహీనుడే మెర్గు. ॥వి॥*

*50. శిలనుజూచి నరులు శివుడని మెత్తురు*
*శిలలు శిలలుగాని శివుడుగాడు*
*తన దులోన శివుని తానేం తెలియడో ॥వి॥*

శివుని విగ్రహాన్ని చూడగానే మానవులు దైవము అంటూ పూజలు చేస్తారు ఆ శివుని విగ్రహము రాతితో చేయబడినది రాయి రాయియే కాని శివుడు కాడు. జీవాన్ని సంతరించుకోలేదు పంచ భూతముల సహాయము లేనిదే జీవి వుత్పత్తి కాదు కాని నీవు పంచభూతాల మూలాన జన్మించి జీవిస్తున్నావు కనుక నీలోయున్న జీవిని తెలుసుకో, అదియే శివుడు

51. తల్లిదండ్రులనుచు తత్వంబు తెలియదు
యోని లింగములను నుద్భవించి
విష్ణు వరయ తల్లి వెంయ రుద్రుడె తండ్రి ॥వి॥

తల్లితండ్రుల నియమములు ఎందుకు తెలియనేరరు. యోని లింగముల ద్వారా సంతానాన్ని కనడమే వారి నియమము స్త్రీపురుషుల సంభోగము వలనవే మానవ జన్మ జరుగును యిది ప్రకృతి నియమము. యిందుకు భిన్నముగా జరుగుటకు వీలులేదు. పర్వతాలకు పుట్టారని, పాయసము తింటె పుట్టినారని నదులకు జన్మించినారని చెప్పడము ప్రకృతి విరుద్ధము.

52. వేష మొనర గట్టి వెంయ శూద్రత్వంబు
తనకు లేదనుకొను ధరణి ద్విజుడు
అరిది గిట్టువేళ నడుగు ద్విజత్వంబు ॥వి॥

వేషము ఆకర్షనీయముగా వుండునట్లు వేసి శూద్రులలో యున్న శూద్రము తనకు లేదనుకుంటాడు బ్రాహ్మణుడు. కావి మరణము జెందు సమయములో బ్రాహ్మణత్వము అడ్డురాదని తెలియలేదు చావు పుట్టువులలో అందరూ సమానమే నంటాడు వేమన.

53. బిందు రక్తములను బెరసిన దేహంబు
చందమెరుగక ద్విజశబ్ద మిడుక
నడచినను విడుచునో నరకంబు మృత్యువు ॥వి॥

రక్తబిందువుల చేత పేర్చబడిన దేహము తీరు యెరుగక మేము బ్రాహ్మణులమని, మా మతము వేరు అనుకున్నను మరణము సంప్రాప్తము కాకమానదు. మృత్యువునకు కుల మత భేదాలు లేవు అందరను సమముగా అనుభవిస్తుంది. చావే నరకము మరనానంతరము ఏమయ్యేది యెవరకు తెలియదు.

54. శివుడు గలడటంచు శిలలకు మ్రొక్కెడు
వెర్రిజీవులారా వెతలు విడుడి.
జీవులందె కాక శిలలమేమున్నది ॥వి॥

శివుడొకడున్నాడని నమ్మి అవివేకులు ఎన్నో కష్టాలుకు లోనై పూజలు చేస్తూ, యాత్రలు తిరుగుతూ వుంటారు. జీవులలో జీవమున్నది కావి శిలలలో ఏమియు లేదు. ఎన్ని రూపాల నొందించిన రాయి రామే కాని దానికి ప్రాణము రాదు, పలుకదు.

55. రాతిప్రతిమ దెచ్చి రాజసంబున నుంచి
పూజసేయు నరుడు బుద్ధిమాలి
భావమందు పరము భావించనేరడా ॥వి॥

కొండరాయిని తెచ్చి ప్రతిమను జేసి దేవాలయములో యుంచి పూజలు చేయడము బుద్ధిలేని పని. పూజలు చేయడము వలన ఫలితాలు పొందినట్లు వ్రాస్తారు. పూజలు చేయడము వలన ప్రయోజనము పొందువారు పూజారులే. మూర్ఖులైన వారు దేవాలయములలో పూజలు చేస్తున్నందునే పూజారుల జీవితము సాగుతుంది. అన్నియువారి జీవనోపాధికే చేయుస్తారు.

56. *తనువులోన జీవతత్వ మెరుంగక*
*వేరెకందటంచు వెదుకనేం*
*భానుడుండ దివ్వె బట్టి వెదుకురీతి* ॥వి॥

నీలోయున్న జీవముయొక్క తత్వాన్ని తెలుసుకో. అంతకుమించిన శక్తిగల శక్తి యేదియు లేదు. నీలోయున్న శక్తిని తెలుసుకోలేనపుడు యింకేదియు తెలిపికొనలేవు. నీవు పగలు వెలుతురులో దివిటి పెట్టి వెదకిన వాడవౌతావు.

57. *అక్షమాల జపము అవని దొంగల రీతి*
*పాడిగాదు జగతి పంచాఙ్గములు జెప్ప*
*కొంచమైన బుద్ధి నొంచలేక*
*బ్రహ్మ మెరుగ కిట్లు పౌరోహితము జేయ* ॥వి॥

మీలోయున్న సృజనాత్మక శక్తిని తెలుసుకో లేక మోసగాళ్లుగా రుద్రాక్షమాలలు ధరించి యితరులకు అశాస్త్రీయమైన పంచాంగములు చెప్పడము తగిన పనికాదు. మీ మేధాశక్తి నుపయోగించి ఆలోచించండి మీకే అనుమానము కలుగుతుంది. బ్రహ్మమెరుగ కిట్లు - సృజనాత్మక శక్తిని తెలుసుకోలేక (ఉత్పాదనా శక్తిని) (బ్రహ్మనెరుగ కిట్లు అనియుంటె బ్రహ్మదేవుని అని చెప్పియుండవచ్చు) పూజారులుగా జీవితము గడపడము న్యాయము కాదు. చేతి వృత్తులవారైన కంసాలి, కమ్మరులు కూడ విశ్వ బ్రాహ్మలమని చెప్పుకుంటారు. వారిలో సృష్టించే శక్తి యుండటము మూలాన వారు అలా పిలువబడటానికి అర్హులే.

58. *నీళ్లమునుగనేం నదుల మెట్టగ నేం*
*మొనసి వేల్పులకును మ్రొక్కనేం*
*కపట కల్మషములు కడుపులో నుండంగ* ॥వి॥

పవిత్ర నదులని (జలాలు) ఆ నీటిలో మునిగి పాపము పోయినదని భ్రమపడటము, పవిత్రమైన పుణ్య క్షేత్రములో దేవుని దర్శించామనుకోవటము వట్టి ప్రయోజనము లేని పని. హృదయ పరివర్తన లేనిదే యెన్ని చేసినను వ్యర్థమే.

59. భూమిపేరు వల్ల పుణ్య స్థలము లాయె.
వెలియు రాళ్ల వల్ల వేల్పులాయె.
నీళ్లపేర్ల వల్ల నిఖిల తీర్థములాయె ॥వి॥

కొన్ని స్థలాలకు పేర్లు పెట్టి అవి పుణ్యస్థలములు అంటారు అదికూడ స్థలమే నీవు వున్నది కూడా స్థలమే పాడురాయిని విగ్రహము చేయించి దేవుడని పూజిస్తే దేవుడవుతాడు రాయిని రాయిగా వుండునట్లు వుంచియుంటె అది రాయియేగాని దేవుడుకాదు నీళ్లకు తీర్థములని పేరుపెట్టారు గంగానదిలో పారే నీటికి గంగతీర్థమని, గోదావరినది నీటిని గోదావరి తీర్థమని పిలుస్తుంటారు కాని అన్ని నదులలో ప్రవహించేది వర్షపునీరె

60. మంత్రవిద్య లెల్ల మాయల కొరకెల
సృష్టియందు బ్రహ్మసృష్టి జేసె
మత్తుడైనవాడు మది నిల్ప దేమయా ॥వి॥

యీ లోకములో గారడీ విద్యలు సృష్టించిన (గారడి బ్రహ్మ) గారడి నేర్పరులు జనులను ఆకర్షించుటకు (సంతోష పెట్టుటకు) యీ విద్యలను ప్రదర్శిస్తున్నారు కాని ప్రేక్షకులు మైమరచి యుండునట్లు చేసి గారడి తంత్రమును ప్రదర్శించును మైమరచిన ప్రజలు ఆ గారడీనే మంత్రముగా భావిస్తారు మంత్రవిద్యలనేవి ఈ లోకములో లేవంటాడు వేమన

61. లంజ కొరకు మేకనంజుడు తినసాగె
యజ్ఞమెల్ల కామ యజ్ఞమాయె
మొదట సోమయాజి తుద కామయాజిరా ॥వి॥

పౌండరీక యజ్ఞము చేయువారు స్వర్గము పోయి రంభతో సంభోగము చేస్తారని వ్రాశారు యింతవరకు యీ యజ్ఞమాచరించి ఆ రంభ దగ్గరకు ఎందరు వెళ్లియున్నారనే లెక్కలు లేవు కామవాంఛ తీర్చుకొనుటకు యింత తంతు జరుపవలయునా? బ్రాహ్మణులు యీ కథలు రాజులకు జెప్పి వారితో యజ్ఞాలు చేయించి మేకమాంసము తిని, సోమము అనే పేరుతో మత్తు పదార్థమును సేవించుటకు కాదా? రాజులనిట్లు ప్రేరేపించి యజ్ఞాలు చేయించి రంభ దగ్గరకు పంపడము తార్పుడు వృత్తి అంటారో ఏమో!

62. కులము హెచ్చు తగ్గు గొడవలు పనిలేదు
సానుజాతమునయ్యె సకల కులము
హెచ్చు తగ్గు మాటలెట్లురుంగవచ్చు ॥వి॥

ఒకటి ఎక్కువ కులమని ఒకటి తక్కువ కులమని వివాదములు

తెచ్చుకొని వాదిస్తుంటారు కాని మానవజాతి యంతయు ఒకటే ఎవరిని, యేకులము వారని నిర్ణయము చేయుటకు ఏ ఆధారములు దొరకవు రక్తమాంసాల ద్వారా కాని శరీర నిర్మాణము ద్వారా కాని ఋజువు చేయలేము మరిదేన్ని బట్టి ఎక్కువ తక్కువలు నిర్ణయించాలి?

63. *మాలవాని నేల మహిమీద నిందింప*
*నొడల రక్తమాంసమొకటి గాదె*
*వానిలోనె వెలుగువాని కులంబేది* ॥వి॥

యీ జనులు మాలవాడనీ, తక్కువ కులము వాడని, అంటరాని వాడని నిందిస్తుంటారు నిందించిన వాడిని, నిందకు గురియైన వాడిది యిద్దరి రక్తమాంసాలు ఒకటేనని తెలియక అజ్ఞానముతో నిందిస్తారు యిద్దరిలోను వున్న ప్రాణి ఒకటే జనన మరణాలు కూడ సమానమే, మానవునికి మాటలు రాక మునుపు అందరూ జంతు సమానులే గదా! మాటలు నేర్చిన తరువాత యీ భేదాలు ఎలా వచ్చాయో?

64. *మాల వాని నంటి మరి నీటి మునిగేరు*
*కాటికేగునపుడు కాల్చు మాల*
*అప్పుడంటినో యంటు యిప్పుడెందేగెనో* ॥వి॥

మాల వానిని తాకడము వలన మైల బడ్డామని స్నానము చేస్తారు కాని పుట్టిన ప్రతివారు చావక తప్పదు చచ్చిన తరువాత అందరను కాల్చేది మాలయే కదా? అప్పుడు అంటు పడడా! మరి ఆ పనిని మాలల కెందు కప్పగించారంటాడు వేమన

65. *మాల మాలగాడు మహి మీదనే పొద్దు*
*మాటతిరుగువాడె మాలవాడు.*
*వాడు మాలయన్న వాడె పోపెను మాల* ॥వి॥

యీ లోకములో మాటతప్పు వాడె మాల కాని మాల కులమంటూ వుందన్నవాడె పెద్ద మాలవాడు

66. *తల్లి బొమ్మ గుడ్డు పరికించి చూడగ*
*కులములన్ని గూడ తోడబుట్టె*
*అందరొకటె గలయ అన్నదమ్ములె కదా* ॥వి॥

పరిశీలించి చూడగా ఒకే తల్లి నల్గురకు జన్మ నిస్తుంది ఆ నల్గురు ఒక రొకరకు నల్గురు సంతానమై ఆ పదహార్గురకు అరవైనాల్గు అయినట్లు మానవజాతి యింత పెద్దదైంది ఆ సంతానాల నుండియె

యిన్ని కులములు పుట్టుకొచ్చాయి యీనాడున్న అందరూ అందులో నుండి వచ్చిన అన్నతమ్ముళ్లే కదా అంటాడు వేమన

67. *జాతి భేదమెంచి జన్మముల్ తెలియక*
*ముక్తిగాన లేరు మూఢజనులు*
*జాతులెంచనేల జన్మంబు తెలియుడీ.* ॥వి॥

జాతి భేదములు యెంచుటకు ముందు నీ జన్మను తెలుసుకో నీ వెట్ల జన్మించినావో యితరులు కూడా అట్లే జన్మించినారు అందరి జన్మలు ఒకటే కాన మన జన్మకు కారణాన్ని తెలుసుకోలేని మనము మూర్ఖులమైపోతాము. బ్రతుకుటకు కూడ అర్హులం కాలేము అందరూ పుట్టవలసిన చోటె పుడుతారు కాని ప్రకృతి విరుద్ధంగా మరొక చోట పుట్టరు పుట్టుకలో. సమమైనప్పుడు అన్నిటను సమానులేనని తెలుసుకోమన్నాడు వేమన.

68. *ఉర్వి జనులకెల్ల నొక్క కంచము బెట్టి*
*పొత్తు గుడిపి కులము పొలయ జేసి*
*తలను చేయి బెట్టి తగనమ్మ జెప్పరా* ॥వి॥

ప్రపంచ ప్రజలందరూ కలిసి ఒక కంచములో భోజనము చేయునట్లు చేయి. అందరిలో కులము, మతము, రంగు అను భేదభావములను తొలగించు. దీనిని నమ్మించుటకు ఎన్ని ప్రమాణములనైన చేసి వొప్పించు. ప్రయోజనము లేని కులాలను త్యజించునట్లు చేయి అన్నాడు వేమన.

69. *తల్లిగన్న తల్లి తనతల్లి పినతల్లి*
*తండ్రి గన్న తల్లి తాతతల్లి*
*యెల్ల శూద్రులైరి యేటి బాపడు తాను* ॥వి॥

బ్రాహ్మణ స్త్రీలకు జందియము లేదు. కాన బ్రాహ్మణ స్త్రీలందరూ శూద్రులే. తల్లి గన్న తల్లి అమ్మమ్మ తన తల్లి పినతల్లి తన తండ్రిని కన్న తల్లి తాతను గన్న తల్లి అందరూ శూద్రులే అయినపుడు తాను బ్రాహ్మణుడు ఎట్లు కాగలడు అని ప్రశ్నించినాడు వేమన.

70. *మాదిగ యనగానె మరి తక్కువందురు*
*మాదిగ యిల సురల మామగాదె*
*మాదిగెకును బిడ్డ మన యరుంధతి గదా* ॥వి॥

మాదిగయనగానె అంటరాని వాడంటారు. మాదిగ మాతంగ మునిదేవతలకు మామయే కదా. ఆయన కూతురు అరుంధతియే గదా

వసిష్ఠుని భార్య. యిందుకు యేమంటారో బ్రాహ్మణోత్తములు వారి గురువుగార్ని గురించి!

71. జాతివార లెల్ల జాతి విద్యలు నేర్చి
జానలైరి మిగుల జగతిలోన
బ్రాహ్మణులు వారు బ్రహ్మంబు నెరుగరు ॥వి॥

బ్రహ్మంబు=ఉత్పాదనా శక్తి, చేతిని ఉపయోగించి చేసినది

అన్ని జాతులవారు తమ తమ వృత్తులలో మిగుల నేర్పరులైనారు యీ ప్రపంచములో. కాని బ్రాహ్మణులు మాత్రము పూర్వకాలము నుండి ఒకేరీతిగా యున్నారు యింతవరకు బ్రాహ్మణులు ఉత్పాదనా శక్తిని తెలుసుకోలేదు. బ్రహ్మమెరుగని వారు అయోగ్యులు పరుల శ్రమశక్తిపై ఆధారపడి జీవించువారు పరాన్నభుక్కులు. చేత ఏదియు చేయలేనివారు.

72. బ్రాహ్మణులకు సకల భాగ్యంబు లీవచ్చు
గౌరవించవచ్చు కలయవచ్చు.
జ్ఞానమొసగి జనుల కడతేర్చునటులైన ॥వి॥

బ్రాహ్మణులకు జీవనానికి అవసరమైన అన్నింటిని సమకూర్చవచ్చు సకల మర్యాదలు చేయవచ్చు కలిసి జీవించవచ్చు కాని వారు ప్రతిఫలంగా ప్రజలలో జ్ఞానాన్ని కలుగజేసి వారి బాధ్యతలను నిర్వహించు నటులైన (కాని బ్రాహ్మణులు ఏ పుస్తకాలు వ్రాసినా యితరుల భావస్వాతంత్ర్యాన్ని హరించడమే జరిగింది) అంటాడు స్వామి వివేకానంద.

73. కసవు మేరి తినెడి పసరము దినువాని
మాలయండ్రుగాని మహిని జనులు
పంది కోడి దిన్న ప్రాజ్ఞులందురా ॥వి॥

గడ్డి గాదముమ యేరి తినే పశువులను తినువారిని మాలలని అంటరాని వారని నిందిస్తారు. అశుద్ధాన్ని (పెంట)తినే పందులను పురుగులను తినే కోళ్ళు తినే వారు వివేకులెట్లు కాగలరని సూటిగా ప్రశ్నించాడు వేమన. పశువులు శాఖాహారము తింటాయి.

74. కసవు పసికి జేసి గాలి ఫణికి జేసి
మన్నెరలకు జేసె మరువకెట్లొ
భూమిజనుల కెల్ల బువ్వట్లు జేసెరా ॥వి॥

జీవులన్నింటికి కూడ బ్రతకడానికి ఆహారము అవసరము. పశువులకు గడ్డి ఆహారంగాను, పాములకు గాలి ఆహారంగాను, ఎరలకు మట్టి ఆహారము

గాను ప్రకృతి ప్రసాదించింది. మరువక జనులకందరకును భూమిని ఆహారము పండించుకొనుటకు ప్రకృతి కల్పించింది కాన భూమి ప్రజలందరి సొమ్ము వ్యక్తిగత జీవులై మానవులందరు భూమిని సమష్టిగా అనుభవించాలి అంటాడు వేమన.

*75. ఆది సోమ భౌమ లంబుధ నిర్జర*
*గురుల శుక్ర శనుల గుర్తు గాగ*
*నేడు దినములయ్యె నిలనొక్కటి వసమే* ॥వి॥

భూమి తిరుగుచున్నందున మనకు రాత్రి పగలు సంభవమౌతుంది. వారములో ఏడు దినములకు ఏడు నక్షత్రముల పేర్లు పెట్టినారు అందులో ఒకటి మంచిది మరొకటి చెడ్డదని చెప్పడము సబబుకాదు అన్ని దినములు సమానమే సూర్యుడు ఉదయించడు, అస్తమించడు గాన సూర్యుడున్నాళ్లు అంతా ఒక దినమే – అని ఖగోళ శాస్త్రాన్ని కూడ తెలిపినాడు వేమన.

*76. తల్లినెరుగువాడు దైవంబు నెరుగును*
*మన్ను నెరుగువాడు మిన్ను నెరుగు*
*మన్ను మిన్నెరిగిన తన్ను తానెరుగును* ॥వి॥

తల్లిని తెలుసుకున్నవాడు తండ్రిని తప్పక తెలియగలడు భూమిని తెలుసుకున్నవాడు అకాశాన్ని గూడ తెలుసుకో గలడు భూమి ఆకాశములను తెలుసున్నవాడు తనను తాను పూర్తిగా తెలుసుకుంటాడు యింతటి జ్ఞానము కలవాడు తన జన్మకు తల్లిదండ్రులే కారణముగాని యే యితర శక్తి తోడ్పాటు అవసరముండదని తెలియగలడు.

*77. సతుల బడయనేల సుతుల బడయనేల*
*వెతల బడగనేల వెర్రితనము*
*నేల మీదిరాయి నెత్తికెత్తిన యట్లు.* ॥వి॥

పరిస్థితులు అనుకూలముగా లేనపుడు వివాహము చేసుకోవటము అదియు గాక అధిక సంతానాన్ని కనడము కోరి కష్టాలను తెచ్చుకున్న విధముగా వుండును నేలపై ఎన్నియో రాళ్లు పడియుంటాయి. మనలను ఆరాళ్లను నేల మోస్తుంది ఆ నేల రాయిని మోస్తుందని దాన్ని నెత్తినిడు కోవటము అవివేకము అన్నాడు వేమన.

*78. కులము వలన కొంత బలము వలన కొంత*
*ధనము వలన కొంత దర్పమెక్కి*
*మంకు చదవు చదివి పెంకెలై పోదురు.* ॥వి॥

మేము గొప్పకులము వారమని బలవంతులమని, ధనవంతులమని కొందరు గర్విష్టులై పోతారు. అటువంటివారు చదివినను సారాన్ని గ్రహించలేరు పిల్లచేష్టలను కూడ విడనాడ లేరు. అటువంటి వారు మూర్ఖులై పోతారు అంటాడు వేమన కులము, బలము, ధనము అహంభావాన్ని కలుగజేస్తాయి

*79. చదువు చదివెనేని సౌఖ్యంబు కలుగును*
*చదువు చదివెనేని సరసుడగును.*
*చదువు మర్మమెరిగి చదివిన చదువురా! ॥వి॥*

చదువుకున్నవాడు సుఖసౌఖ్యములను పొందగలడు చదువుకున్నవాడు జ్ఞాని అవుటకు వీలుంది కాని చదువుటకు, వ్రాయుటకు నేర్వడము చదువు కానేరదు చదివిన ప్రతి విషయాన్ని క్షుణ్ణంగా అర్థము చేసుకున్న వాడె చదువుయొక్క ఫలితాన్ని పొందగలడు వ్రాతలలో ఎన్నో మర్మాలు దాగి యుంటాయి. కాన కష్టపడి చదువులలోని రహస్యాలను తెలుసుకున్న వాడె చదువరి అవుతాడు – జ్ఞాని అవుతాడు అంటాడు వేమన

*80. ధనము లేమియనుట దావా నలంబది*
*తన్నుజెరుచు మీరి దాపుజెరుచు*
*ధనములేమి మదిని తలపోయ పాపంబు ॥వి॥*

మంటలు పరిసరాలను యెలా దహించి వెస్తాయో అట్లాగే దరిద్రము కూడ పరిసరాలకు వ్యాప్తి జెందుతుంది అటువంటి దరిద్రాన్ని తలందాచడము కూడ పాపమే కాన దరిద్రమును దరిదాపులకు రాకుండా జాగ్రత్తపడడము అవసరమంటాడు వేమన

*81. కులము గల్గువారు గోత్రంబు కలవారు*
*విద్యచేత విర్రవీగు వారు*
*పసిడి కలుగు వాని బానిస కొడుకులు ॥వి॥*

గొప్ప కులస్తులమని గొప్ప వంశీకులమని విద్యావంతులమని ఎవ్వరు గర్వపడరాదు సంపాదించే వీలులేనపుడు వీరందరు ధనవంతులకు బానిసలు కావలసి వస్తుంది కాన ఎంతటి గొప్పవారైనా తమ్ము తాము పోషించుకొనుటకు ఏర్పాట్లు చేసుకోవాలి అంటాడు వేమన

*82. కలిగిన మనుజుండు కాముండు సోముండు.*
*మిగుల తేజమునను మెరయుచుండు*
*విత్తహీనుడరయ నుత్తసన్యాసిరా ॥వి॥*

ధనవంతుని యింద్రునిగా చంద్రునిగా చూస్తుంది సమాజము ధన

వంతుడు కలకలలాడుతు జీవితము సాగిస్తారు. కాని ధనములేని పేదవాడు సన్యాసి (దరిద్రుడు)గా జీవితము గడప వలసి వుంటుంది. కానీ జీవించిన వ్యక్తులందరు తమను తాము పోషించుకొనుటకు యోగ్యతలు కలిగి యుండాలి. కష్టించి పనిచేయడము నేర్వాలి.

*83. పసుల వన్నె వేరుపా లేక వర్ణమౌ*
*పుష్పజాతి వేరు పూజ యొకటె*
*దర్శనములు వేరు దైవంబ దొక్కడె ॥వి॥*

ఎరుపు, తెలుపు, నలుపు పలు రంగులలో పశువులుంటాయి. కాని అన్ని పశువులు తెల్లని పాలనే యిస్తాయి. పూల లోపల జాతులున్నాయి కాని ఒక్కొక్క పూవును అర్పించి వేరు వేరుగా పూజలిడము. అన్ని పూలతో పూజిస్తాము. పూజలు పలురకాలుగా చేస్తుంటారు, కాని అన్ని భాషల వారి అన్ని మతాల వారికీ దేవుడు ఒక్కడే. దేవతలు వేరుగా లేరు. ప్రతి మతస్థుడు తమ దేవుడు వేరు అని తలంచడము అవివేకమే. అది పశువుల రంగును బట్టి పాలు వుంటాయని వూహించడమే అగును.

*84. మర్మ మెరుగ లేక మతముల గల్పించి*
*యుర్విజనులు దుఃఖమొందుచుంద్రు*
*గాజు టింటి కుక్క కలవరపడు రీతి ॥వి॥*

మానవులే స్వయముగా మతములను కల్పించుకున్నారు. తాము కల్పించుకొన్న మతముల ద్వారానే అధికము గా కష్టాలను అనుభవిస్తున్నారు. తాము కల్పించుకున్న మతముల రహస్యమేమిటో వారె తెలియలేకున్నారు. యిది యెంతయు అద్దాల గదిలో కుక్క తన ప్రతిబింబమును చూచి మొరిగి మొరిగి ప్రయోజనము లేనట్లు తెలుసుకోలేక కలవరపడురీతిగా యుండును కాన మతాలలోని సత్యమును తెల్సి జీవించడము అవసరము అన్నాడు వేమన.

*85. కామిగానివాడు కవిగాడు రవిగాడు*
*కామిగాక మోక్షకామి గాడు*
*కామియైనవాడు కవియౌను రవియౌను ॥వి॥*

కోర్కెలు లేనివాడు ఏమి అవడు. కవి కావలయునని కోరిక యున్న కవి కావచ్చు. తాను కీర్తి గడించి ప్రకాశించవలయునన్నా ఆ కోరిక యుండాలి. సాధించవలయునన్న కోరిక యున్నవాడె కవి గాని, రవిగాని మరేదైన కాగలడు.

86. మలిన వస్త్రములతోడ మాసిన తల తోడ
నొడల జిడ్డు తోడ నుండెనేని
అగ్రజన్ముడైన నట్టెపొమ్మందురు ॥వి॥

బ్రాహ్మణుడైనను అపరిశుభ్రమైన వస్త్రములను ధరించి శరీరము మురికితో యున్న వానిని దూరముగా పొమ్మంటారు, శుభ్రముగా లేనివాని హృదయము కూడ పవిత్రమైనదిగా యుండదేమో!

87. చెమట కారునట్లు శ్రమజేసి దేహంబు
గడన జేసి కూడు కుడువవలయు
తల్లిదండ్రి సొమ్ము తాదింట కారాదు ॥వి॥

దేహము చెమట కారునట్లు పనిచేసి బ్రతకటము మంచి మార్గము. నా తలిదండ్రులు సంపాదించినారు గదాయని తాను పూర్వీకుల ఆస్తినుండి వచ్చే రాబడి తినడము చేయరాదు పూర్వీకుల ఆస్థికి తాను ధర్మకర్తగా వ్యవహరించాలే కాని తినరాదు. అందులో నుండి దానము చేయవచ్చు.

88. భూమి నాదియన్న భూమి పక్కున నవ్వు
దానహీను జూచి ధనము నవ్వు
కదనభీతు జూచి కాలుండు నవ్వురా ॥వి॥

భూమి నాది అనడము నగుబాట్ల మాటే. భూమి శాశ్వత మైనది మనము అశాశ్వతులము. యీ సంపద నాది యనడము కూడ అంతే. నాది యనుకొనుచు దానముచేయక దాచువానిని జూచి ధనము నవ్వుతుందంటాడు వేమన యుద్ధరంగములో నుండి ప్రాణాలను దక్కించుకో చూచి పారిపోవువానిని మాత్రము మృత్యువు వదలగలదా అంటాడు వేమన

89. జీవిపోకముందె జీవవస్తువు లిచ్చి
జీవి నిలుపవలయు జీవనముగ
జీవి తొలగు వెనుక జీవ వస్తువు లేల ॥వి॥

ప్రాణముతో యుండగా వైద్యము చేయించి కోరిన వస్తువులు సమకూర్చి ఎక్కువ కాలము జీవించునట్లు చూడు. చచ్చిన అతని కొరకు నీవు ఏది చేసినా అతనికి అందదు చచ్చిన తరువాత ఖర్చుచేసి సమాధి కట్టడము కంటె ప్రాణము వుండగానె ఖర్చుచేసి ప్రాణాన్ని కాపాడడము మంచిది. సమాధి దగ్గర సమాధి అయిన వ్యక్తి వాడిన వస్తువులను వుంచి మ్రొక్కుచుంటారు. మరణించిన వారు ఏది గ్రహించలేరు, సత్యమింతే

90. కుండ కుంభమన్న కొండ పర్వతమన్న
ఉప్పు లవణమన్న నొకటి గాదె.
భాషలిట్లు వేరు పరతత్వ మొక్కటే. ॥వి॥

ఒకే వస్తువును పలు భాషలలో పలు పేర్లతో పిలుస్తాము వుప్పును సాల్టు అనియు లవణం అనియు నమ్మక్ అనియు వారి వారి భాషలలో పేర్లు పెట్టారు భాషలు వేరు కాని పదార్థం అదే ఏ భాషలో సంబోధించినా దాని స్వగుణము మారదు

91. రాళ్లనమ్మియున్న రాజాధిరాజులు
కూటికెడలి భువిని కూలి చనిరి
రాళ్లు పగుల గొట్టి రాక్షసపుత్రులు
మాళ్లు నూళ్లు గలిగి మనిరి వేమ ॥వి॥

రాతి విగ్రహాలను పూజిస్తు ఆ విగ్రహాలే దేవతలనియు వాటి వలననే తమకు రక్షణ కలదనియు నమ్మిన రాజులు, మహమ్మదీయులు దండయాత్రలు చేసి విగ్రహాలను ముక్కలు జేసి వాటి క్రిందయున్న ధనరాసులను యెత్తుకపోగా విగ్రహాలు తమ మహిమతో తమ్ము రక్షించు కోలేకపోయినవి రాజులు కూటికి లేక దరిద్రులై సుస్కించి మరనించారు అంటాడు వేమన

92. బ్రహ్మ వ్రాత కెదురు పల్కెడు వాడును
ఆదివిష్ణు సూత్రమరయు వాడు
మూడు కనులవాని మొనసి నిల్చెడువాడు
కాన బడడు నీవు గాక వేమ. ॥వి॥

బ్రహ్మరాత అనునది యేదియు లేదనియు అసలు బ్రహ్మయే లేడనియు మానవులందరి తలలు ప్రకృతి ధర్మముగా ఉండవలసిన రీతిలోనె యుండునన్నాడు ఆ మహావిష్ణువును కూడ నీ ఉనికి ఎక్కడ నీవు చేస్తున్న పని ఏమిటని ప్రశ్నించాడు త్రినేత్రునికి యెదురు నిలిచి నీ శక్తిని ప్రదర్శించమన్నాడు యీ విధముగా ప్రశ్నించినవాడు నీవు తప్ప మరొకడు లేడు వేమా అంటాడు వేమన ముగ్గురను వ్యతిరేకించాడు

93. వ్రాత కొలదిగాని వరమీదు దైవంబు
చేతకొలది గాని వ్రాతకాదు
వ్రాతకజుడు కర్తచేతకు తాకర్త ॥వి॥

బ్రహ్మ వ్రాసినట్లు జరుగుతుందంటారు కాని చేత వ్రాస్తె గాని వ్రాత కాదు వ్రాయించే వాడు దైవమైనా వ్రాసెవాడివి నీవె నీ వ్రాత ఫలము నీ ప్రవర్తన పైననే ఆధారపడియుంటుంది కాని ఏ దైవశక్తి మీద ఆధారపడి లేదు అంటాడు వేమన

94. విత్త మొకరికిచ్చి వితరన గుణముల
చిత్తమొకరి కిచ్చి చెరచినాడు
బ్రహ్మయాలి ముండ బండ రేవునమోయ ॥వి॥

బ్రహ్మ సంపదగలవాని నొసట దానహీనునిగను, దరిద్రుని నొసట దాన కర్ణునిగను వ్రాశాడు యీ వ్రాత ఏమి ప్రయోజనము లేనిది దానము చేయతలపెట్టిన వాని తావున ధనము లేదు ధనమున్న వానికి దానగుణము లేదు యిలా వ్రాయడము మూర్ఖుని వ్రాత అందుచే బ్రహ్మ చచ్చి అతని భార్య నీరులేని బండరేవున ముండమోయాలి అన్నాడు వేమన

95. పునుగు పిల్లికేల పొదిగె సువాసనల్
కనకము తనకేమి కల్ల జేసె
బ్రహ్మచేత లెల్ల పాడైన చేతలు ॥వి॥

ఆ ఊరిలో సంచారము చేయు పునుగు పిల్లికి సువాసనలు కల్పించాడు బ్రహ్మ అది మనకు దూరములో యున్నను సువాసన నిస్తుంది విలువైన లోహము బంగారము ఆభరణాలు చేయించుకుని మెడలో వేసుకుంటారు అటువంటి బంగారము బ్రహ్మకు ఏమి చెరుపు చేసింది బంగారమే సువాసన కలదిగా చేసియుంటె మన గృహాలు ఎల్లప్పుడు సువాసనతో నిండియుండేవి కదా! బ్రహ్మ శక్తికలవాడై యుండి కూడా ప్రయోజము లేని పనులు చేస్తాడెందుకు అంటాడు వేమన

96. ఉదదిలోన నీళ్లు వుప్పులుగా జేసె
పసిడి కల్గువాని పిసిని జేసె
బ్రహ్మదేవు చేత పాడైన చేతలు ॥వి॥

సముద్ర జలాలన్నియు వుప్పు నీళ్లుగా చేసినాడు బ్రహ్మ సృష్టికర్త చేయవలసిన పనియేనా యిది. సంపదగల వాడిని పిసిని గొట్టుగా చేశాడు యితడు చేసింది పాడుపని - యతని బుద్ధి పాడు బుద్ధి కాదా అంటాడు వేమన

97. లంజ లంజ యంద్రు లౌకిక ధర్మాన
లంజకాని దెవతె రాజ్యమందు
లంజకొడుకు బ్రహ్మవ్రాలెట్లు వ్రాసెరా ॥వి॥

98. బల్లి పలుకులు విని ప్రజ తమ పనులెల్ల
సఫల మగుననుచు సంతసించి
కాని పనులకు తమ ఖర్మమటందురు ॥వి॥

బల్లి పలికింది కాబట్టి తమపని అయి తీరుతుందని నమ్ముతారు. అ పనికానిచో బల్లి పలుకులు నమ్మరాదని భావించరు పని కాకపోవడాని తమ కర్మ కారణమని తమనే నిందించుకుంటారు

99. *పాలపక్షి శకున ఫలమిచ్చు నందురు*
*పాలపక్షి కేమి ఫలము తెలుసు*
*తనకు కాని మంచి తనలోన యుండంగ* ॥వి॥

పాలపక్షి శకునము మంచి ఫలమిస్తుందని భావిస్తారు. మానవులు చేస్తున్న పనులను గురించి పాలపక్షి కేమి తెలియదు కార్యము చేయువాని అసమర్థతే కార్యము నెరవేరకపోవుటకు కారణము అది తెలియక పక్షిపైన తోస్తారు జనులు అంటాడు వేమన

100 *గూబ గృహము జేరగు నిసిపొడుగ బెట్టి*
*వెల్లిపోయెద రెంత వెర్రివారో*
*గూబ గృహము లేమి గూర్చురా ఖర్మంబు* ॥వి॥

గూబను గుడ్ల గూబ అని కూడ అంటారు గూబ యింట్లో ప్రవేసించడము వలన యింటివారికి హాని కలుగుతుందంటారు గూబప్ర వేసించిన యింటిని కాళీచేసి కొన్ని మానములు కాళీగా వుంచుతారు అ తరవాత బ్రాహ్మ ణుని చేత శాంతి చేయించి యింట్లో ప్రవేశిస్తారు అ పక్షి యింటిని గూడుగా భావించి అందులో ప్రవేశిస్తుంది దాని వలన మేలుగాని కీడుగాని జరుగదు.

101. *శకునములను మంచి సాముద్రికములను*
*కనినవారలెవరు కలియుగమున*
*మేలుకో కీడు కోమేలిమి జూపును*
*కూర్చగలుగు చోట గురుతు వేమా* ॥వి॥

శకునములు, సాముద్రిక శాస్త్రము జ్యోతిశ్యము యివి అన్నియు అశాస్త్రీయములె ఫలితాలను ఖచ్చితముగా చెప్పినవారు గాని చెప్పిం చుకొన్నవారు గాని లేరు ఏదో గుడ్డిగా చెప్పినది యేదైనా కావచ్చును కాకపోవచ్చును అయినదానికి శకున ఫలమంటారు కాని దానికి తమ ఖర్మను నిందిస్తారు

102. *కనక మృగము భువిని కలదు లేదనకయే*
*తరుని విడిచిపోయె దాశరధియు*
*తెలివిలేనివాడు దేవుడెట్లాయెరా* ॥వి॥

కనీస యింగితజ్ఞానము కూడా లేక బంగారు మృగము కలదా లేదాయని ఆలోచించక రాముడు భార్య యైన సీతను ఒంటరిగా వదలి ఆ మృగము వెంటపోవడము రాముని అజ్ఞానాన్ని సూచిస్తుంది యిటువంటి తెలివిలేని రాముని దేవుడుగా భావించడము ఎంత వింత అని అంటాడు వేమన

103 అగ్ని బాణము చేత అంబుధినింకించి
రాముడవలికేగ లావుమరచె
వరుస కొండలు మోసి వారధేటికి గట్టె ॥వి॥

రాముడు అగ్ని బాణాన్ని ప్రయోగించి సముద్ర జలాలను యింకిపోయే టట్లు చేసినాడు వెంటనే దాటుటకు మరిచిపోయాడు ఆలశ్యమైనందున సముద్రము తిరిగి తన పూర్వ స్థితిని పొందింది ఆలశ్యమైనందున రాముడు కొండలు మోసి వారధి గట్టవలసి వచ్చింది యీ మతిమరుపు రాముడు ఎంత అయోగ్యుడో ఆలోచించండి అంటాడు వేమన

104. మెలత నడివి నుంచి మృగము వెంటనె పోవు
రామచంద్రుకన్న రసికుడేడి
చేటు కాలమునకు చెడు బుద్ధి పుట్టును ॥వి॥

రాముడు వేటపైయున్న ఆరాటముతో తన భార్యయైన సీతను ఒంటరిగా ఆ అడవిలో విడిచిపెట్టిపోయెను వినాశకాలె విపరీత బుద్ధి అన్నట్లుగా రాముడైన దేవుడు కాలనిర్ణయాన్ని అధిగమించలేకపోయినాడు. యిచ్చట కాలనిర్ణయమే గొప్పది గాని దైవనిర్ణయము ఏమిలేదంటాడు వేమన

105. కులము నీరుజేసి గురువును వధియింప
పొసగనేనుగంత బొంకు బొంకె
పేరు ధర్మరాజు పెను వేపవిత్తయా ॥వి॥

ద్రోణాచార్యుని చంపుటకు వంశగౌరవాన్ని అప్రతిష్టపాలు చేసి అందరు మనస్సులలో అతికే విధముగా ఆడరాని పెద్ద అబద్ధాన్ని ఆడినాడు ధర్మరాజు పేరు ధర్మరాజే కాని గొప్ప ద్రోహి అంటాడు వేమన

106. తాత జనించె కన్యకకు తండ్రులు తామును గుండ గోలకుల్
మాత పరానుకూలినియె మక్కువ ద్రౌపది భర్తలేవురున్
నీతులు జెప్ప పాండవుల నీతుల నిట్టి వటంచు నెన్నుచున్
భూతలమందు నెంతయును భూమెలు జేసిరి వెర్రి వేమన. ॥వి॥

107. పంచమ నిగమంబు భారతం బగునని
పొగడిరేల జనులు బుద్ధిలేక
హింసకార్యము తమ కిష్ట మెట్లాయెరా! ॥వి॥

భారతమే యుద్ధము యుద్ధము ఎప్పుడూ హింసతో కూడి వుండును దీనిని అయిదవ వేదమని పొగిడెవారు చాదస్తపు పండితులు ప్రజలు యిటువంటి హింసతో కూడిన భారతాన్ని ఏవిధముగా ప్రేమించినారు అన్నాడు వేమన

*108. కొండ దండి మామ కొండ కూతురె యాలు*
*కొండమేటివిల్లు కొండ యిల్లు*
*కొండవంటి దొరయుగుండైపోయెరా* *॥వి॥*

పర్వతరాజుకు అల్లుడు అయిన శంకరుడు కైలాస పర్వతములలో నివసించెవాడు కదా! శంకరుడు కామాంధుడై దారు కావనములోని మునిపత్నులపై జరిపె ఆగడాలు అధికమైనాయి తమ భార్యలపై శివుడు జరుపుతున్న అగడాలకు కోపించిన ఋషులు శివుని గుండై పోవునట్లు శపించారు శివుడు గుండై పోయాడు యిటువంటి వారు మనకు దేవతలై పూజలందుకునేందుకు అర్హులేనా? అవతార పురుషుడు క్రిష్ణుడు కూడా వ్యభిచారి వీరా మనకు దేవతలు అంటాడు వేమన

*109. సత్య మమరియుండ జ్ఞాన మమరియుండు*
*జ్ఞాన మమరియుండ సత్యముండు*
*సత్యజ్ఞానములును సమమైన ద్విజుడగు* *॥వి॥*

సత్యాన్ని ఆచరణలో పెట్టువాడె జ్ఞానము కలవాడౌతాడు జ్ఞానము కలవాడె సత్యము గలవాడు అగును కాన జ్ఞానము, సత్యము కలవాడె గొప్పవాడు, విశ్వమానవుడు అట్టివారికి కులము మతము అడ్డురాదు అట్టివాఢు అన్ని కులములను, మతములను, భాషలను, రంగులను సమముగా ప్రేమించగలడు. సత్యము, జ్ఞానములేనివాడు బ్రాహ్మడు కానేరడు

*110. భూమిలోన బుట్టు భూసారమెల్లను*
*తనువులోన బుట్టు తత్వమెల్ల*
*శ్రమమునందు బుట్టు సర్వముతానౌను* *॥వి॥*

భూమిపైన నివసించు జీవరాసులకు అనగా చెట్లు, మానవులు, జంతువులు, పక్షులు సమస్త జీవరాశికి కావల్సిన ఆహార పదార్థము భూమిలోనుండు సారముననే లభ్యమగుచున్నది అదే విధముగా మానవుడు ఆలోచించగా, ఆలోచించగా జ్ఞానము - తత్వము వృద్ధి యగును అదే విధముగా శ్రమ (పని) చేయుట ద్వారా ఉనికికి అవసరమైన ఆహారము, గుడ్డ, గూడు సర్వసంపదలు కూడ శ్రమద్వారానే సమకూరుచున్నవి యిందులోనే ఒక్క మాటలో శ్రమ విలువను మొత్తము వివరించినాడు వేమన

111. బ్రహ్మవంశ భవులు ప్రబలులైయుండగా
యితర జాతులకు సుగతులు గలవె
వనములోని కోతి వసుమతి నడుపునా ॥వి॥

బ్రాహ్మణులు సంఘములో అధికులైయున్నంత కాలము యితర జాతులను అభివృద్ధి చెందనీయరు ప్రజను పాలించుటకు అనర్హులు అదెట్లెనగా అడవిలోని కోతి రాజ్యాన్ని పాలించలేదని భావించాలి అంటాడు వేమన

112. గ్రాసమింత లేక కడు కష్టపడుచున్న
విద్య యేల యబ్బు వెడలుగాక
పచ్చికుండ నీళ్లు పట్టిన నిలుచునా! ॥వి॥

పోషకవిలువలు గల ఆహారము, శుభ్రముగాగల పరిసరాలు, శుభ్రమైన యిల్లు, వస్త్రాలు లేని వాతావరణములో పెరిగె పిల్లలకు విద్య రావడము కష్టము ముందుగా పేదలు వుండె పరిసరాలను మార్చడము, గాలి వెలుతురు యిచ్చె యింటిని శుభ్రతను కలిగియుండెటట్లు మొదలు వారికి కల్పించాలి యిది యీనాటి సంఘ అభివృద్ధినీ కోరేవారికి చక్కటి సూచన

113. తనదు సొమ్ము చూడ దాన మీయగ వచ్చు
అవని దొడ్డగాదెవరికైన
అదురు బెదురు లేక అన్యుల సొమ్మును
దాన మిచ్చు వాడే దాత వేమా! ॥వి॥

తన సొమ్మును దానము చేయడము ఎవరికిని గొప్ప గాదు యితరుల సొమ్మును అదిరించి, బెదిరించి, సేకరించి దానము చేయువాడె గొప్ప దాత!

114. ద్రోహబుద్ధినైన దొంగరికమునైన
నటననైన సాహసముననైన
సంపదధికువలన సాధించి ధనమును
బడుగునకు నొసంగ బాగు వేమా!

మోసగించియైన, దొంగతనము వలననైన, ఎటువంటి సాహసమైన అవలంబించి అధిక సంపన్నులనుండి ధనాన్ని సేకరించి నికృష్ట జీవితము ననుభవించు పేదలకు అందించమని విజ్ఞప్తి చేశారు వేమన

115. కరకంఠుని శాపము వలె
వరగౌతము శాపమట్లు వర్ధిల్లంగా
జిర కష్టజీవులై తగు
నరులును మది నొచ్చి తిట్ట నాశము వేమా!

శ్రమ జీవులను బాధించిన, పీడించినా వారి కోపాగ్ని జ్వాలలో శంకరుని కోపాగ్నికి బూడిదయ్యైన మన్మధుని వలె, గౌతముని కోపాగ్నికి రాయియ్యైన అహల్య వలె, కష్టజీవుల తిట్లు వృధాకావని హెచ్చరించాడు వేమన.

116. *బ్రహ్మ యెవని కొడుకు పరికింపగా భువి*
*విష్ణువెవని కొడుకు వెలయ జూడ*
*శివుడు యెవరి కొడుకు సిగ్గెరుగరు జనుల్* ॥వి॥

బ్రహ్మ విష్ణువు బొడ్డులో పుట్టినాడని, విష్ణువు బ్రహ్మ మనస్సులో జన్మించిన ధర్మునికి జన్మించినట్లు, శివుడు బ్రహ్మ కోపములోనుండి పుట్టినాడని పురాణ రచయితలు వ్రాశారు యీ విధముగా సృష్టికి వ్యతిరేకముగా జన్మించడము సాధ్యమా? ఆలోచించండి యీ త్రిమూర్తులకు తల్లితండ్రులు ఎవరని వేమన ప్రశ్నించాడు అజ్ఞానులైన జనులు వీరి ఉనికిని ప్రశ్నించక పూజలిడడము అవివేకము, అజ్ఞానము వీరు పుట్టను లేదు, చావనులేదు పురాణ రచయితలే వీరిని సృష్టించారు యిది యంతయు ప్రజల భావ స్వాతంత్ర్యములను హరించుటకే వ్రాశారు ఖర్మ సిద్ధాంతమును ప్రజలలో నిలుకడగా యుండునట్లు చేయుటకే యిందరు దేవతలను సృష్టించినారు ప్రపంచములో ఏ యితర దేశములలో లేని యిందరు దేవతలు యీ దేశములో ఎందుకు జన్మించినారు? యిక్కడి పూజారి వర్గము ఎల్ల కాలము పూజలు చేయిస్తూ సంభావనలు పొందుతూ తమ ప్రయోజనాలను దృష్టియందుంచుకొని యిందరు దేవతలను సృష్టించారు

117. *తంత్రవాదులైతె తరచుగా నుందురు*
*మంత్రవాదులైతె మహిని లేరు*
*జంత్రగాని బొమ్మ చందంబు లాయెరా!* ॥వి॥

తంత్రవిద్యలు అనగా గారడీ విద్యలు చేయువారు తరచుగా అగుపడుదురు మనదేశములో ప్రఖ్యాతి గాంచిన సత్యశాయి బాబ ప్రదర్శించునదియు గారడి విద్యయే మంత్రవిద్యలనునవి యేవియు ప్రపంచములో లేవు మంత్రవిద్యలంటూ వున్నాయని అవి తమకు తెలియునని బ్రాహ్మణులు అదేపనిగా చెప్పుకొనుచున్నందున భారతీయులలో మంత్రమున్నదను భావన స్థిరముగాయున్నది ప్రపంచములో ఏ యితర దేశములలోను మంత్రవిద్యలను గురించి మన దేశములో వున్నంత ప్రభావము లేదు మంత్రవిద్యలలో మనకు నమ్మకము వున్నందున ప్రతి గారడీ వాడు చేయునది కూడ మంత్ర ప్రభావము వలన చేశాడని భ్రమపడుతాము వడ్రంగి జంత్రము చేసి బొమ్మను తయారు చేసి మంత్రము చేసినా నన్నను మనము నమ్మే స్థితిలో యున్నాము మన ఆలోచనా శక్తిని పూర్తిగా హరించివేశారు

భావవాదులు. కనుక జాగ్రత్తగా పరిశీలించి గారడీ విద్యలను తెలుసు కోమన్నాడు వేమన

118 *కుక్క తిన్నవాడు గురులింగ జంగంబు*
*పంది తిన్నవాడు పరమయోగి*
*ఏన్గు తిన్నవాడు యెంత సుజ్ఞానిరా!* ॥వి॥

కుక్కబుద్ధి నిలుకడ లేనిది అటువంటి అస్థిరమైన గుణాన్ని హృదయములో నుండి తొలగించి, స్థిరత్వాన్ని సాధించిన వాడె నిజమైన లింగ జంగము అవుతాడు పంది మురికి కాలువలలో మురికిని తినె మురికి జంతువు హృదయములో నున్న మురికిని హరించి కల్మషములేని హృదయము కలవాడె జ్ఞాని అవును ఏనుగు బలానికి మారుపేరు అది దాని బలాన్ని దుర్వినియోగము చేసినచో ఎవరము ఆపలేము తనకు బలమున్నదని తన బలాన్ని యుతరుల మీద ప్రయోగించెడు చెడుగుణమును ఏనుగు హరించినది బలవంతులు కూడ తమ బలాన్ని బలహీనుల మీద ప్రయోంగించకుండిన బలవంతులు అధికమైన జ్ఞానము కలవారౌతారు అంటాడు వేమన. కాన మానవులందరు స్థిరమైన మనస్సును కలిగి, కల్మషము లేనటువంటి హృదయము కలవారై బలహీనులయెడ దయగల వారై వుండగలరని కోరినాడు వేమన

119. *సంధ్య వార్చగనేమి జపముసేయగనేమి*
*వేదశాస్త్రములను వెలయనేమి*
*పడతి గననివాడు బాపడు గాడయా!* ॥వి॥

బ్రాహ్మణులు నియమముగా సంధ్యావార్చడము, జపము చేయడము చేస్తుంటారు వేదములను చదువుచుంటారు కాని కొందరు భార్యలకు దూరముగా యుంటారు. యిటువంటి వారు మత్తు పదార్థములు సేవించడము, వ్యభిచరించడము కూడ చేస్తుంటారు. భార్యలకు దూరమైన వారిని బ్రాహ్మణులుగా గుర్తించరాదంటాడు వేమన

120. *కలియుగ మున నున్న కాపు కులానకు*
*వేమన తనకీర్తి విక్రయించె*
*నున్నధర్మ మెల్లనుర్వి లోనరులకు*
*కోరుబెట్టె పరము గోరి వేమ* ॥వి॥

వేమన తన యందున్న ధర్మములన్నియు తాను కీర్తిని కోరి యితరులకు పూర్తిగా దత్తము చేశాడు తనకు దక్కిన కీర్తిని గూడ స్వకులస్తులైన కాపులకు పూర్తిగా విక్రయించాడు కాన కాపులందరు వేమన బోధనలను

ఆచరించి ప్రతిఫలాన్ని అందించగలరని ఆశించాడు కాన తమ వాడుగ భావించిన కాపులు కులమత రహితులై విశ్వమానవులుగా ఆదర్శవంతులుగా తన వారసులుగా వర్తించగలగాలని వారిని కోరినాడు వేమన

*121. ఉపవసములనుండి యోగి నీళ్లలో మున్గి*
*కూడువండి వేల్పు గుడువు మనుచు*
*దాని నోరుగొట్టి తమరె తిందురు గదా! ॥వి॥*

ఉపవాసములుండి భక్తితో నీటిలో స్నానమాచరించి వంటలు చేసి దేవునికి నైవేద్యము పెట్టి దేవుని తినుమని ప్రార్థిస్తారు కాని దేవుడు జీవుడు కాడు గదా తినుటకు దేవుని పేరు చెప్పుకొని తామె తింటారు గాదా! దేవుడు తినేటట్లైతే వారు పెట్టేవారు కూడా కాదు యిది యంతయు ఒక తంతు మాత్రమే

*122 సకలాకారు డనంతుడు*
*సకలాత్మల యందు సర్వసాక్షియుతానై*
*సకలమున నిర్వికారుం*
*డకలంక స్థితిని బ్రహ్మమనబడు వేమా. ॥వి॥*

*123. ఆశగోసి వేసి యనలంబుసల్లార్చి*
*గోచిబిగియగట్టి కోపమడచి*
*యాసవిడిచెనేని అతడు దాయోగిరా! ॥వి॥*

ఆశను పూర్తిగా చంపి, ఆకలిని గూడ జయించి, కోపమును అణచివేసి కామము అను అన్ని కోర్కెలను జయించిన వాడె తాను నిజమైన యోగి అవుతాడు అంటాడు వేమన

*124. గుణవిహీన జనుని గుణమెంచగానేల?*
*బుద్ధిలేనివాని పూజలేల?*
*మనసులేని వాని మంత్రంబు లేలరా? ॥వి॥*

ఏ గుణము లేనటువంటి వారి గుణమును ప్రశ్నించడము దండుగ ఏ గుణములేనటువంటి చూపులేనటువంటి రాతి విగ్రహాలకు పూజలు చేసిన ఏమి ప్రయోజనము. రాతి విగ్రహాలకు జీవముండదు, మనసు వుండదు వినలేని కనలేని అటువంటి విగ్రహాలముందు మంత్రాలు వల్లించినచో ఏమి ప్రయోజనము అంటాడు వేమన

*125. ముట్టు ముట్టనుచు ముట్టరాదందురు*
*ముట్టుకు దరియేమి మూలమేమి?*

*నవ బిలంబుల మురికి నరుల కందరకును*
*పుట్టగానె పుట్టు ముట్టు వేమ.* ॥వి॥

స్త్రీలను ముట్టుయినారనుచు, అట్టివారిని తాకరాదనుచు దూరముగా వుంచుతారు ముట్టు అనగా ఏమి దానికి మూలకారణ మేమి అనియు కూడ తెలియలేరు మానవుని పుట్టుకలోనె తొమ్మిది రంధ్రములలో మురకి పుట్టి బయటకు రావడము శరీర నియమము అంటాడు వేమన.

126. *చచ్చు వారలెవరు చావని వారేరి?*
*చచ్చి బ్రతికియుండు జనములెవరు?*
*విచ్చలవిడిగాను వివరించిచూడరా?* ॥వి॥

అందరు మానవులు మరణించే వారె చావనివారెవరైనా వున్నారా? చచ్చిన తరువాత బ్రతికి వచ్చినవారు ఎవరైనా వున్నారా? అన్ని కోణాలనుండి వివరముగా ఆలోచించండి పుట్టిన వారు గిట్టడము తప్పదు అంటాడు వేమన.

127. *పరధనములకు చేయిపట్టెను మిక్కిలి*
*సత్యమింత లేక జారుడయ్యె*
*ద్విజుడను కొను తాను తేజమింతయు లేక* ॥వి॥

బ్రాహ్మణులు యితరులను తమకు దానముః చేయండని చేయి చాస్తారు. దానమిచ్చిన వారిని పొగడుతారు, దీవిస్తారు తమకు దానము చేయువారికి దైవము అన్ని కోర్కెలు తీర్చుతారంటారు యిందులో ఏమాత్రము సత్యము లేదు సత్యమైనచో వారె దైవాన్ని పొగడి సరాసరి దైవమునుండియె పొందవచ్చు గదా! యిటువంటి ఫలితాన్నివ్వని ఆశీర్వాదములన్నియు అబద్ధాలె యిటువంటి అబద్ధాలాడెవాడు తాను బ్రాహ్మణుడనుకోవడము ఏమి సబబు అంటాడు వేమన

128 *కల్లలాడు కంటె కష్టంబు మరిలేదు.*
*కష్టమెపుడు నోలిగలిగియుండు*
*ద్విజుడననుట చూడ దిమ్మరి తనమది* ॥వి॥

అబద్ధాలాడడము కంటె హీనమైన దేదియులేదు నోటినుండి అబద్ధాలు మాత్రమే యెల్లప్పుడు పలుకువాడు తాను బ్రాహ్మణుడననుట ఏమి ప్రయోజనము ఎల్లప్పుడు అబద్ధాలాడటము సంచార జాతుల లక్షణము యాచకుల లక్షణము ఫలితము యివ్వని దీవెనలందించడమే వారి పని

129. *కల్లటికెకు భూతి గట్టిగా పెట్టిన*
*నందులోని కంపు లుడుగునట్లు*
*మెడను త్రాడువేయ మెరుపుతో ద్విజుడౌనె?* ॥వి॥

కల్లుకుండకు మూత వుంచి గాలి చొరకుండునట్లు సందులకు బూడిద మెత్తి పెట్టినంత మాత్రాన అందులోని చెడు వాసన నసించదు గదా! అట్లాగె మెడలో జందియము వేసిన క్షణములోనె ముందున్న గుణములు యెట్లా మారును మెరుపు ఒక క్షణము వెలుతురు నందించి వెలుతుంది. అట్లా జందియము వేసుకున్నా వాని మునుపటి గుణము మెడలో జందియము వేసుకున్న క్షణములోనె, మెరుపులాగ అంతరించిపోవునా? కల్లుకుండలో చెడు వాసన దాగియున్నట్లు మనసులో ఎన్నో చెడు గుణాలు దాగియుంటాయి క్షణాలలో వాటిని నిర్మూలించడము సాధ్యమా అంటాడు వేమన

*130. ఆసనముల బన్ని యంగంబు బిగియించి*
*మొదలు విరుచుకొనెడు యోగమెల్ల*
*జెట్టి సాముకన్న చింతాకు తక్కువ* ॥వి॥

ఎన్నియో ఆసనములు వేసి, గాలి పీల్చడమును, నిలుకడచేసి, శరీరాన్ని ఆసనముల ద్వారా పలువిధాలుగా కష్టపెట్టినను యివి అన్నియు గూడ మల్లుడు ప్రదర్శించే విద్య కంటె తక్కువే నంటాడు వేమన

*131 కూడుచీర బాసి గుడ్డపంచల బడు*
*నట్లు వ్రాసె బ్రహ్మ యతుల నుదుట*
*తోయజాక్షి జేర దోషంబులంటునా?* ॥వి॥

కొందరు స్త్రీలను దరిద్రులుగా కూటికి గుడ్డకు లేక గుడులలో నివసించునట్లు వారి నుదుట ఆ బ్రహ్మదేవుడే వ్రాశాడు అటువంటి తామర కన్నులు కల స్త్రీతో కలువడము దోషమగునా? బ్రహ్మవారి కట్లు ఎందుకు వ్రాశాడు అంటాడు వేమన

*132. పాపమనగ వేరె పరదేశమునలేదు*
*తనదు కర్మములను దగిలియుండు*
*కర్మ తంత్రి గాక గనుకని యుంటొప్పు* ॥వి॥

పరులకు ఉపకారము చేయడము పుణ్యము అపకారము చేయడము పాపమంటారు పాపమనునది ఎక్కడనుండియో వచ్చి మనల చేరదు మనము చేసె పనులను బట్టియె యుండును చెడు కార్యములను చేయక జీవితము గడుపు, తప్పుడు పనులు చేసి పాపివై ఎన్ని పూజలు చేసినా, యాత్రలు చేసినా పాపమును హరించ లేవు అంటాడు వేమన

*133. అరయ తరచు కల్లలాడెడు వారిండ్ల*
*వెడలకేల లక్ష్మి విశ్రమించు*
*ఓటికుండ నీరుపోసిన చందాన* ॥వి॥

సంపదను నిలుపుకొనవలెనన్న నీతి నియమములు పాటించవలసియుండును ఎల్లప్పుడు అబద్ధాలాడె వారి యిండ్లలో సంపద నిలువదు చిల్లులుండెకుండలో నీరెట్లునిలవయుండదో అట్లె అబద్ధమాడువారి యిండ్లలోను సంపద నిలువదు అంటాడు వేమన

దానమొసగుకన్న దేనంబు మరి హెచ్చు.
దేనమొసగుకున్న తెలివి హెచ్చు
తెలివికన్ననాస దెగవేసినది హెచ్చు ॥వి॥

134. అడివి తిరుగలేదు యా కసమున లేదు
యవనితీర్థయాత్రలందు లేదు.
ఒడలు శుద్ధిజేసి యొడయని జూడరా ॥వి॥

నీకున్న సమస్యల పరిష్కారమార్గము నీవు అడవులు తిరిగినా ఆకాశము వైపు చూచినా దొరకదు నీవు ఎన్ని నదులలో మునిగినా పవిత్రమన్న స్థలములలో పూజలు చేసినా కనుగొనలేవు శరీరాన్ని బలమైనదిగా వుంచుకుని నీ శరీరములో దాగియున్న శ్రమశక్తిని తెలుసుకో. శ్రమించడము మూలాన్నే నీకున్న సమస్యలన్నియు పరిష్కరించుకోగలవంటాడు వేమన

135. గాలి గాలి గలసె గగనంబు
మన్నుమన్ను గలసె మంట మంట
నీరునీరుగలసె నిర్మలంబైయుండె ॥వి॥

శరీరానికి మరణము ప్రాప్తమైనపుడు గాలి గాలిలోను సూన్యము సూన్యములోను మన్నుతో చేయబడిన శరీరము మన్నులోను, వేడివేడిలోను, నీరునీరులోను కలిసిపోవును యివియే పంచభూతాలు అంటారు వేటిలో అవి యిక్కడే కలసిపోవును యిక మిగలిందేది లేదు ఆత్మ ఒకటుందని దానికి చావులేదని చెప్పడము అంతా బూటకము అంటాడు వేమన

136. స్వానుభూతి లేక శాస్త్రవాసనలచే
సంశయంబు చెడదు సాధకునకు
చిత్రదీపమునను చీకటి చెడనట్లు ॥వి॥

స్వానుభవము లేకున్న ఎన్ని శాస్త్రములను చదివినను ఏవి చేయాలన్నా సంశయము కలుగుతుంది శాస్త్రము చదవటము బొమ్మదీపము లాంటిది దీపపు బొమ్మ వెలుగు నీయదు. అట్లాగే శాస్త్రము అనుభవ లేక యుండిన పనిచేయదు కాన అనుభవము చాలా హెచ్చైనది అంటాడు వేమన

137. నీటిమీది వ్రాత నిలువకయున్నట్లు
పాటి జగతిలేదు పరము లేదు
మాటమాట కెల్ల మనసు కోరుచునుండు ॥వి॥

ఈ లోకమునకు సమమైనది ఏదియు లేదు పరలోకమనునది పట్టి బూటకపు మాట స్వర్గమనునది ఒకటున్నదని అక్కడకు చేరుకోవాలని మన మనసు ఎప్పుడు కోరుకుంటుంది కాని యీపరలోకభావము నీటిమీది వ్రాతలాంటిది. నీటి మీది వ్రాత నిలువదు అనునది ఎంత సత్యమో పరలోకములేదన్నది కూడ అంత సత్యము అంటాడు వేమన

138. వేమన జెప్పిన మాటలు
సామంబునస కల వేదసారంబుగదా?
నామెతపంచాక్షరిలో
నీ మహిమలు దెలియకున్ననింపా వేమా. ॥వి॥

వేమనా నీవు చెప్పిన మాటలు వేదములలో పోల్చినవాటి సారాంశమే గదా! నీమహిమలు తెలియనివాడు నల్గురిలో రాణించగలడా? వేమన బోధనలు లోకమంతయు వ్యాపించినవి గదా! అంటాడు వేమన

139 తనువదెవరి సొమ్ము తనదని పోషింప
ధనము యెవరి సొమ్ము దాచుకొనగ
ప్రాణమెవరి సొమ్ము పాయకుండగ నిల్ప ॥వి॥

యిది నాశరీరము అని పోషిస్తున్నావు, అది నీదేనా? ధనము నాదని దాచుకొనుచున్నావు, అది నీదేనా? నాప్రాణము అంటున్నావు, అది నిలుపుకొనుట నీ వశమా? అన్నియు అశాశ్వతములే గదా? వీటికి యింత పోషణ ఎందుకు? వీటినన్నింటిని తృనంగా చూసినవాడె ఉత్తముడంటాడు వేమన

140. ఈతకంటెల్లోతు నెంచగ పనిలేదు.
చావుకంటె కీడు జగతిలేదు
గోచిపాత కంటె కొంచంబు మరి లేదు ॥వి॥

ఈత నేర్చినపుడు లోతును గురించి భయపడనవసరము లేదు ఈదడము నీటిపైన అయినపుడు లోతు ఎంతయున్న నేమి కీడు మూడుతుందని ఎప్పుడు భయపడవద్దు ఎంత గొప్ప కీడు అయినను చావును మించి యుండదు దరిద్రమొస్తుందని భయపడకు, కనీసము గోచియయినను వుంటుంది అది లేనిచో ఎవరైన గోచికి కావలసిన గుడ్డను యిస్తారు అంటాడు వేమన చావుకంటె గండము లేదు, గోచి కంటె దరిద్రము లేదు అంటారు

141 మాటనిలుప లేని మనుజుండు చండాలు
డాజ్ఞ లేని రాజు యీడు ముండ
మహిమలేని వేల్పు మంటజేసిన పులి ॥వి॥

మాట నిలబెట్టుకోలేనివాడు చండాలుడు ప్రజలను ఆజ్ఞాపించి పరిపాలన చేయలేని రాజు దిక్కులేనివాడు అవుతాడు మహిమలు లేని దేవతలు మట్టితో జేసిన పులి బొమ్మలు ఏ దేవతలు ఎప్పుడు మహిమలు చూపించిన పాపాన పోలేదు దైవ మహిమలను గురించి పూజారులు ఎప్పుడు అబద్ధపు ప్రచారము చేస్తూనే వుంటారు

పూసపోగులైన పుట్టంబు విడియంబు
కాయపుష్టి మిగుల గలిగియున్న
హీనజాతినైన నింధురమ్మందురు //వి//

బలమైన శరీరము కలిగి పోగులు ధరించి మంచి దుస్తులు ధరించి తాంబూలమువేసియున్న వానిని హీన జాతి వాడైనను అందరు దగ్గర చేరనిస్తారు. అందువలన అస్పృశ్యత పోవాలంటె ముందు వారి దరిద్రాన్ని నిర్మూలించాలి. ధనవంతులైనచో అస్పృశ్యత దానంటతదే తొలుగుతుందంటాడు వేమన

అప్పు చేయరోత హరిహరాదులకైన
మొప్పెతోడమైత్రిమొదలె రోత
తప్పుబలుక రోత తాకట్టిడిన రోత //వి//

ఎంతటి గొప్పవారైనను అప్పు చేయడము సమర్ధనీయము కాదు మూర్ఖునితో స్నేహము చేయడము ఒక చెడ్డపని అబద్దాలాడడము చాలా హీనమైనపని యిద్దరిలో వైరుధ్యాన్ని పెంచుటకు అటువియిటు యిటువి అటు కల్పించి చెప్పుట సమర్ధనీయము కాదు అది చెడు పరిణామాలకు దారి తీయునంటాడు వేమన

చేటువచ్చెనేని చెడనాడు దైవంబు
మేలు వచ్చెనేని మెచ్చుదన్ను
చేటు మేలు తలప జేసిన కర్మముల్ //వి//

ఏదైన కష్టము కలిగినపుడు దైవాన్ని దూషిస్తారు తమకు మేలు జరిగినపుడు తమ ప్రతిభను గురించి మెచ్చుకుంటారు ఏపనియైనను కావడము కాకపోవడము మనము చేయు ప్రయత్నము మీద ఆధారపడియుండును కాని మన ప్రయత్నలోభమును తెలుసుకోలేక దైవదూషణము మొదలిడుతాము చెడిన పనికి కూడ బాద్యత మనదేనని గ్రహిస్తే మనలో ఆలోచన పెరుగునంటాడు వేమన కాని చెడిన పనికి కారణము తెలుసుకోగలము

పాలు పెరుగు వెన్న పాయసాన్నము నెయ్యి
జున్నునెన్నియైన జాడపాలు
పాలవంటికులము "బ్రహ్మంబు"గానరో //వి//

పాలు, పెరుగు, వెన్న పాలతోజేసిన అన్నము నెయ్యి జున్ను అన్నియు పాలనుండి పుట్టినవే అటువంటి పాలను వుత్పత్తిజేసే కల్మషము లేనటువంటి వారికులము, వారి వుత్పాదనా శక్తిని ఎందుకు తెలుసుకోలేరు అంటాడు వేమన యిక్కడ బ్రహ్మంబు అనగా వుత్పత్తి చేయుశక్తి

*దానమడుగువాడు ధరలోన నధముండు*
*దానమడుగడేని దైవసముండు*
*దానమీనివాడు ధన్యుండుకాడయా* ॥వే॥

యాచించి బ్రతికెవారు యీ భూమిపై అందరికంటె తక్కువవారు యాచించె బ్రాహ్మడు కూడ తక్కువవాడె తనశక్తిని తెలుసుకొని కష్టపడి పనిచేసి బ్రతికెవాడు దైవసమానుడు దానము పొందుటకు అడిగినవాడు అర్హుడొకాడొ తెలిసి దానమీయవలెను దానానికి అర్హుడని తెలిసి దానమీయనివాడు కలిగియుండుటకు కూడ యోగ్యుడు కాదంటాడు వేమన

*నిరుపేదల రక్షించే*
*సరసుడు నెరదాతగాకసంపన్నుడా*
*భరియించువాడు దాతయె?*
*మెరమెచ్చుల దాతయతడు మేదిని వేమా!*

నిరుపేదలకు ప్రతిఫలమాసించక సహాయము చేయువాడు దాత ప్రయోజనాన్ని ఆసించి కలవారికి సహాయపడువాడు దాత అనిపించుకోడు కొందరు పేరు ప్రతిష్టల కొరకు దానము చేస్తుంటారు అటువంటివారిని దానపరులుగా గుర్తించడము అజ్ఞానము అంటాడు వేమన అట్టివారు యితరుల మెప్పును పొందుటకు చేస్తారుకాని దానగుణము కలిగికాదు

*వానను దడియనివారును*
*పూనుక వేమన్న సేత బొరయనివారున్*
*నానాదిక్కుల వెదకిన*
*గానము వానంతవాని గానము వేమా* ॥వే॥

వానకు తడియనివారు యెవరు వుండరు కోరికతో వేమన్న బోధనలను విననివారును వుండరు. నాల్గుదిక్కుల వెదకి చూచిననూ వున్నారని తెలుసుకోలేము వేమన అంతటి వానిని యీప్రపంచములో ఎక్కడున్నాడో తెలియలేము ప్రపంచములోని మేటి తత్వవేత్తలలో మేటితత్వవేత్త వేమన, అయనకు అయనేసాటి అంటాడు వేమన

బ్రహ్మ వేత్తలమని పౌరుషమాడేరు
బ్రహ్మ మనగ దానిభావమేమి
తెలుపొ నలుపొ యెరుపొ తెలసిన బలుకుడీ ॥వి॥

బ్రహ్మవేత్తలు=వస్తూత్పత్తి చేయునిపుణులు బ్రాహ్మలమని బీరాలుపలుకువారు దేనిని సృష్టించారు 'బ్రహ్మ' అనగా అర్థముఏమి, భావముఏమి తెలియచేయండి 'బ్రహ్మ' దాని రూపమును, తెలుపొ, నలుపొ, యెరుపొ తెలిసియుండిన వివరించి చెప్పమంటాడు వేమన బ్రహ్మమనగా=సృష్టించడము, ఉత్పాదనాశక్తిగా మనము తెలియాలి

స్త్రీ నెత్తిన రుద్రునకును
స్త్రీనోటను బ్రహ్మకెపుడు సిరి గుల్కంగా
స్త్రీ నెరి రొమ్మున హరికిని
స్త్రీ నెడ పగ గురుడ వీవుదేవరవేమా ॥వి॥

శంకరుడు గంగను నెత్తినెత్తుకున్నాడు బ్రహ్మ నోట భార్యయైన సరస్వతి యెప్పుడు నాట్య మాడుచుండును లక్ష్మీదేవిని విష్ణువు రొమ్ములపై నిడుకుని యున్నాడు అటువంటి స్త్రీల చేతల్లో చిక్కని నీవు దైవసమానుడవు అంటాడు వేమన

దైవసుతుల నరులు తమవంటివారని
యరసిగూడ తత్వమరయలేరు
యిట్లుమాయపడిన నెట్లు మర్మముదెల్సు ॥వి॥

బ్రాహ్మణులు తాము దైవవంశజులమని చెప్పకుంటారు జన్మించిన ప్రతివానికి తల్లి దండ్రులుండవలసిందె, తాతముత్తాతలు వుండవలసిందె యిది ప్రకృతి ధర్మము మరోవిధముగా తాము జన్మించినామను వారు చెప్పనది పూర్తిగా అబద్ధము బ్రాహ్మణేతరులు బ్రాహ్మలు కూడ తమవంటి వారేనని చూస్తూకూడ ఎందు తెలియలేరొ అందరూ పుట్టినట్లే వారుకూడ పుట్టినారు మరోవిధముగా జన్మించి యుంటారని మోసపోవద్దు అలా మోసపడినచో వారి మోసాలను తెలియలేరంటాడు వేమన

పూడ్చిపెట్టిన సొమ్మెల్ల భూమిపాలు
దాచియుంచిన సొమ్మెల్ల పరులపాలు
తిండికొచ్చిన సొమ్మెల్ల తినుకుపాలు
దానమిచ్చిన సొమ్మెల్ల తనకు వేమా

భూమిలో పూడ్చిన సంపదంతయు భూమిపాలగును గాని ఎవరికి దక్కదు అందరకు అగుపడునట్లుంచిన సంపదను దొంగిలించవచ్చు

లేదా దోపిడి చేయవచ్చును విందు భోజనాలకు సంపదను ఖర్చు చేసిన తిన్నవారందరి కడుపులలో జీర్ణమై మలముగా విసర్జింపబడునే కాని తిన్నవారికి నిలువదు దరిద్రులే దానాన్ని ఆశిస్తారు కాన దరిద్రులకు దానముచేయుచో వారికష్టాన్ని కొంతపరకైనా తీర్చుకుంటారు కాన దానము చేసిన సొమ్ము మాత్రమే తనకు మిగులుతుందంటాడు వేమన

*పుట్టిచచ్చునరుడు పూర్వమేమి దెలక*
*బట్టబయలు నుండి భ్రమసి యెపుడు*
*తెలివి విడిచి భూమి తిరుగంగ నేటికి* ॥వి॥

మానవులు జన్మిస్తుంటారు మరణిస్తుంటారు. కాని పూర్వజన్మను గురించి యేమియు తెలియలేరు పూర్వజన్మ పునర్జన్మములు అసలేలేవు జీవి పోయిన వెంటనే గాలి గాలిలో నీరు నీటిలో వేడి వేడిలో కలిసిపోతాయి మరు జన్మ కలదు అనివమ్మి పుణ్యమనునది ఒకటున్నదని దానిని సంపాదించుటకు దేశ ద్రిమ్మరులై యాత్రలు చేస్తుంటారు యివియన్నియు భ్రమలేకాని యిందులో నిజము ఏమాత్రము లేదు యివి యన్నియు అజ్ఞానముతో చేయుపనులేనంటాడు వేమన యితరులకు మేలు చేయడము పుణ్యము, యితరులను పీడించడము పాపము తాము ఏ పని చేయక యితరుల కష్టార్జితముపై ఆధారపడి జీవించు వారలందరూ పాపాత్ములే

*చంప తగినయట్టి శత్రువుదనచేత*
*జిక్కెనేని కీడు చేయరాదు*
*పొసగమేలు చేసి పొమ్మనుటే చావు* ॥వి॥

చంపుటకు అన్నివిధముల అర్హతగల శత్రువు తనచేత బంధి అయినపుడు కీడు చేయుటకు పూనుకోవద్దు ఆ తరుణములో అతనికి కావలసిన సహాయము అందించి పంపడమే అతనికి చావు అంటాడు వేమన

*రవి కననిది కవి యెరుగును*
*కవి యెరుగని చోటు రవియు కానడు భువిలో*
*రవి కన్నమిగులనెక్కువ*
*కవియై విలసిల్లు నీవు కానర వేమా.* ॥వి॥

సూర్యుడు కూడ చూడని దానిని కవి చూడగలడు కవి చూడని చోటును యీ భూలోకములో సూర్యుడు కూడ చూడలేడు సూర్యునికంటె కవియే అధికుడు కవివై వర్ధిల్లి నీవు చూడగలిగినావు వేమా! కవిత్వం వాస్తవాన్ని మించిన వాస్తవం అన్నాడట ఆంగ్లమహాకవి టెన్నిసన్

గురువుతానమైన హరుని తాజూపును
బ్రహ్మ లోకమతడు పారజూపు
శిష్యునరసిపట్టి చీకటి బాపురా ॥వి॥

నిజమైన గురువైన నాతడు వుత్పాదనా మార్గమును నేర్పును (సృష్టించు మార్గమును) యీలోకములో వుత్పత్తిలో పాల్గొంటున్న శక్తులనన్నింటిని రుజావుగా చూపించవచ్చును. శిష్యుని వదలక అతనిలో యున్న అజ్ఞానాన్ని పారద్రోలి బ్రతుకుటకు అనువైన పని చేయునటుల శిక్షణ యొసంగును అంటాడు వేమన

ధనమే మూలము జగతికి
ధనమే మూలంబు సకల ధర్మంబులకున్
గొనమే మూలము సిరులకు
మనమే మూలంబు ముక్తి మహిమకు వేమా.

మనిషి జీవించుటకు ధనము కావలయును ధనము శ్రమ పడడము వలన లభిస్తుంది అన్నిధర్మములను పాటించవలెనన్న ధనము కలవారై యుండాలి సాహసించి కష్టిపడడము వలననే సంపద చేకూరును సుఖజీవనము చేయుటకు మహిమలు కారణమని చెప్పే వారి మాటలు కల్ల మనము, మన మనస్సే యిట్టి భ్రమలకు కారణము అంటాడు వేమన

తమను గన్నవారు తముగన్నవారును
చచ్చుటెల్ల తమకు సాక్షిగాదె?
బ్రతుకుటెల్ల తమకు బ్రహ్మ కల్పంబులా ॥వి॥

తాము కన్న సంతానము, తమ తల్లిదండ్రులు తమ యెదుటే మరణించడము తాము చూస్తున్నారు గదా! తాము కూడ మరణించవలసిందె అందరూ చావుకు దూరమై బ్రతికినచో అది ప్రళయమునకు దారి తీయదా అంటాడు వేమన

చమురు గలుగు దివ్వె సరవితో మండును
చమురులేని దివ్వె సమసిపోవు
తనువు తీరనేని తలపు తోడనె తీరు ॥వి॥

దీపము మండుటకు చమురు కారణము చమురు వున్నంతవరకు దీపము వెలుగుతుంది కాని నూనె (చమురు) అయిపోయిన వెంటనే దీపము ఆరిపోతుంది అలాగే బొందిలో ప్రాణము వున్నంతవరకు కోరికలు వుండును కాని శరీరములో నుండి ప్రాణము పోయినవెంటనే కోరికలు కూడ నశిస్తాయి కాన మానవుడు బ్రతికి యున్నంతవరకు కోరికలు వుండునంటాడు వేమన

*ఇంద్రియ పరవశు డధీముం*
*ఇంద్రియ పరవశుడు భక్తియెడ మధ్యముడౌ*
*నింద్రియ జయుడుత్తముడుజి*
*తేంద్రియ సమ్మదుడు విన మహేశుడు వేమా.*

కోరికలకు లోనైన మనుజుడు అధముడు భక్తియనెడు కోరిక గలవాడు, మధ్యముడు యింద్రియములను జయించినవాడు వుత్తముడు కోరికలు లేనివాడు సృష్టికి కర్త కాగలడు, వుత్పాదకుడుకాగలడు కార్మికుడే యీశ్వరుడన్న అర్థము ధ్వనిస్తుంది శ్రమ జీవులకు ఎంతో ప్రాధాన్యత నిచ్చాడు వేమన

*తన గుణము తనకు నుండగ*
*నెనయంగా నొరుని గుణము నెంచును మదిలో*
*తనగుణము తాను దెలియక*
*బరునిందంజేయువాడు భ్రష్టుడు వేమా.*

ప్రతివ్యక్తికి తనదంటూ వొక రకమైన గుణము వుంటుంది తన గుణమును తాను తెలియలేనివాడు యితరుల గుణములను నిందిస్తుంటాడు అట్టివాడు అన్నింటను భ్రష్టు పట్టినవాడగునంటాడు వేమన తన్ను తాను తెలుసుకున్నవాడే జ్ఞాని మొదలు నిన్ను నీవు తెలుసుకొనుటకు ప్రయత్నించు అంటాడు వేమన

*జపము బాహ్యపూజల జేసి పిదప*
*కపటము విడలేక కష్టనరులు*
*ముక్తి నొందలేక మునిగిరి తమమున* ॥వి॥

జనులు జపతపాలు, పూజలు యెన్నో చేస్తుంటారు అవి యన్నియు యితరులకు ప్రదర్శించుటకే వారు కపటము విడనాడక ఏమి ఫలితాలను పొందలేరు కపట మనస్కులకు కష్టాలు రావటము కూడ కద్దు కపట హృదయులై కష్టాలనుండి విముక్తులు కావడమునకు ఎన్ని తపములు యెల్లకాలము చేసినను ప్రయోజనము పొందలేరంటాడు వేమన

*దొంగమాటలాడ దొరుకునా మోక్షంబు?*
*చేతగాని కూత చెల్లదెపుడు*
*గురువు పద్దుగాదు గుణహీనమదిగాక* ॥వి॥

అబద్ధాలాడి ఏసమస్యను పరిష్కరించుకోలేము ఏమి శ్రమ బడకుండా చెప్పే మాటలు ఎవరు నమ్మరు అబద్ధాలాడడము వలన, ఏమి శ్రమచేయక సాధించాలని కోరటము మంచి పద్ధతి గాదు అది తెలివి తక్కువవారు ఆలోచించు తెలివి తక్కువ ఆలోచన మాత్రమే అంటాడు వేమన

ఉర్విజనులు పరమయోగీశ్వరుని జూచి
తెగడువారు గాని తెలియలేరు
అమృతమాది రుచుల హస్తమే మెరుగును ॥వి॥

అమృతాన్ని అయినా విషాన్ని అయినా నోటికి అందిస్తుంది హస్తము కాని హస్తము ఏ రుచులు తెలుసుకోలేదు అలాగే యోగులను చూచినంతనె తెగపొగడుచుంటారు భక్తులు యోగి యనగా యెటువంటివాడు, అతనికుండవలసిన లక్షణాలు ఏవి అతడు ఎందుకు యోగి అయినాడు అని ఏమియు తెలుసుకోరు అంటాడు వేమన ముందుగా పరిశీలన చేయండంటాడు

విను వివేకమనెడు వింతగొడ్డలిచే, తగు
న' లయ విద్యయనెడు నడవి నరికి
తెలివి యనెడు గొప్ప దీపంబు చేపట్టి
ముక్తి జూడవచ్చు మొనసి వేమా.

వివేకమునటువంటి వింతైన ఆయుధాన్ని చేతపట్టి ప్రజలను ఆవరించియున్న అవిద్యయను అరణ్యమును నరికి జ్ఞానదీపాన్ని వెలిగించి అందరూ చదువరులై అందరూ సుఖమయమైన జీవితాన్ని పొందవచ్చునంటాడు వేమన

మొదట నతడు జ్ఞానముద్రాంకితుడు గాక
నావిధమును దెలియ నజ్ఞుడగుచు
నడుమ జ్ఞానమొదవ నగుబాటు కాదయా ॥వి॥

మొదటినుండి అతడు జ్ఞానికాదు అజ్ఞానినని తెలియక జ్ఞాని కావలయునని కోరుకుంటాడు అతని అజ్ఞానముచే మొదటినుండి లేని జ్ఞానము తరువాత ఎలా అబ్బుతుంది అలా కోరుకోవటము నగుబాట్లకు దారి తీయునంటాడు వేమన

జ్ఞానులమని యెంచి చపలాత్ములగు వారు
తెలివిలేక తమ్ము తెలియలేరు
కష్టగహణమందుకాట్పడియున్నారు ॥వి॥

మనసు నిలుకడ లేనివారు తమ్ముతాము జ్ఞానులమని భావిస్తారు. తాము జ్ఞానులముకాదని తెలియుటకు కావలసిన తెలివి వారికి వుండదు. తెలుసుకొనుటకు కావలసిన తెలివిలేనివారు యేదియు తెలుసుకోలేరు. అట్టివారు కష్టమైన గుహలోయుండి ఎటుపోవుటకు దారి తెలియక దిక్కుతోచనివారు అంటాడు వేమన

*పెద్దలవచనములు ప్రేమతో జూచితా*

*నటులం నడువబోవ నసువు పడదు*

*పులిని జూచి నక్క పూత బూశినయట్లు* ॥వి॥

పెద్దలు వచించు తీరును భక్తితో విని, వారి ప్రవర్తనను చూచి తాను కూడ వారిననుసరించి వారివలెనె యితరులపై పెత్తనాన్ని కలిగియుండవలెనను కోరిక అనుకూలమైనది కాదు అది పులివలె తాను వుండవలయునని కోరి నక్క వాతలు పెట్టుకున్నట్లు కాగలదు కాన అనుసరణ ఎప్పుడు పనికిరాదు స్వయం నిర్ణయము అవసరము అంటాడు వేమన

*గుణహీన జనుని గుణమెంచగానేల?*

*బుద్ధిలేనివాని పూజలేల*

*మనసు లేనివాని మంత్రంబులేలరా?* ॥వి॥

ఏ గుణము లేని బుద్ధిలేనివాని గుణమును విమర్శించడము బుద్ధిలేనితనమే రాతి విగ్రహాలకు జీవము చూపు వినికిడి ఏమియు వుండవు అవి మామూలు రాళ్లే విగ్రహాలుగా చెక్కబడినంతమాత్రమున రాయి స్వగుణము మారదు అటువంటి రాళ్లను పూజించడము తగినంత ఆలోచన లేకయే అటువంటి విగ్రహాలముందు నిలిచి మంత్రాలు చదవటము ఏమి ప్రయోజనము యీ పూజా తంతు సామాన్యులను మోసగించుటకె వుపయోగపడును కాని, విగ్రహము మంత్రాన్ని వినలేదు విగ్రహాలను అలంకరించడం పట్టువస్త్రాలను ధరింపజేయడము, వజ్రాలహారాలు వేయడము యివియన్నియు సామాన్యులలో దైవవిగ్రహములో ఏదో శక్తి దాగియుందని బ్రమలు కల్పించుటకే గాని వేరుకాదు యివియన్నియు దేవుని కోర్కెలు కాదు గాని పూజారుల కోర్కెలేనను సత్యాన్ని తెలుసకో అంటాడు వేమన

*కూడు విడచియు శతకోటి పడగలెత్తి*

*మాటిమాటికదియు మంటగలిపి*

*కాటి కేగువేళ కూటికి మోసమై*

*దాటిపోదురు జముదరికి వేమా*

తినక కుడువక కోటానకోట్లు సంపాదించి, సంపాదించినదంతయు ప్రతిసారి భూమిలో దాచి, మరణ సమయములో దాచిన సొమ్ము అందుబాటులో లేక కనీస అవసరమైన కూటికి కూడ కరువై ప్రాణాన్ని కోల్పోతారు. అటువంటి సంపద వలన ఏమి ప్రయోజనము అంటాడు వేమన.

*తనకు జేయు మేలు తాతెలియగనేర్చు*
*నెంమితోడ కుక్క యెరుక భువిని*
*తనకు జేయుమేలు తాదెలియగలేని*
*మనుజుడెంత ఖలుడు మహిలోని వేమా*

కుక్క చాల విశ్వాసము గల జంతువు కుక్క తనను పోషిస్తున్న యజమానికి విశ్వాసపాత్రము కలదైయుండును శత్రువుల బారినుండి యజమానిని రక్షిస్తుంది కూడా కాని మానవుడు తన్ను పోషించిన యజమానిని గుర్తించడు సరికదా హాని చేయుటకు కూడ వెనుకాడడు మనుష్యులలో యిటువంటి దుర్మార్గులున్నారంటాడు వేమన

*అరుదుగా నడిగిన యతడర్థిగాబోడు*
*తరచుగా నొసగక దాతగాడు*
*దాత నర్థికింత తారతమ్యము కల్గు* //వి//

యేదో ఒక సమయములో ఆపదలో మాత్రమే యితరుల సహాయాన్ని కోరువాడు యాచకుడు కానేరడు కాని దాతయను వాడు ఎల్లకాలము దానము చేయవలసిందె . కాన యాచించే వాడికి దానపరునకు వున్న తేడాను గమనించండి అంటాడు వేమన

*ధనములేనికులము తక్కువ పడివచ్చు*
*ధనము లేమి కీర్తి దంగిపోవు*
*ధనము లేమి శుచినిదగ బుట్టనియ్యదు*
*ధనము లేమి ఘనత దప్పు వేమా*

దరిద్రులు యెప్పుడూ తక్కువ కులము వారుగానె చూడబడుతారు. దరిద్రులు ఎప్పుడు ఎవరిచేత కీర్తించబడరు ధనము లేనివారెప్పుడు శుభ్రముగా హోదాతో బ్రతకటము సాధ్యముగాదు దరిద్రుడు ఎప్పుడు ఘనుడనిపించుకోలేడు ధనము యొక్క ప్రాధాన్యతను వివరించి చెప్పాడు వేమన

*చచ్చు వారలెవరు చావనివారేరి?*
*చచ్చి బ్రతికి యుండు జనములెవరు*
*విచ్చలవిడిగాను వివరించిచూడరా* //వి//

జన్మించిన ప్రతివారును మరణించవలసిందె చావనివారంటూ యెవరు లేరు కొందరు మరణించినను బ్రతికియుండగా ప్రజలు మరువరాని కొన్ని ప్రజలకు వుపయోగపడు పనులు చేసి మరణించడమువలన వారు మరణించినను బ్రతికినవారితో సమానమే కాన ప్రజలు మిమ్ము మరువరాని పని యేదైనా చేయండని కోరుతాడు వేమన

క్రింది పట్టికలో ప్రపంచదేశాల పేర్లు, విస్తీర్ణము, జనాభా,
చదువుకున్నవారి %, తలసరి ఆదాయము యివ్వబడినవి
యివి ఆయా దేశాలలోని ప్రజల జీవనస్థాయిని తెలుసుకొనుటకు తోడ్పడును
ఈ పట్టికలో యిచ్చినవి 1994 కాలెండరు సంవత్సరమునవి

| క్ర సం | దేశము పేరు | విస్తీర్ణము చ కి మీ | జనాభా | 100 కి చదువు కున్నవారు | తలసరి ఆదాయము USA డాలర్లలో |
|---|---|---|---|---|---|
| 1 | బంగ్లాదేశ్ | 143999 | 119300000 | 47 | 200 |
| 2 | భూటాన్ | 46500 | 1660000 | 15 | 190 |
| 3 | మాల్ దీవులు | 298 | 231000 | 93 | 470 |
| 4 | నేపాల్ | 147181 | 20600000 | 29 | 180 |
| 5 | పాకిస్తాన్ | 796095 | 124800000 | 35 | 380 |
| 6 | శ్రీలంక | 65610 | 17900000 | 90 | 550 |
| 7 | ఆఫ్ఘనిస్తాన్ | 647497 | 20500000 | 29 | 220 |
| 8 | ఆల్బేనియా | 28748 | 3300000 | 75 | 1300 |
| 9 | అల్జీరియా | 2381741 | 27100000 | 52 | 2450 |
| 10 | అండోరా | 464 | 59000 | 99 | – |
| 11 | అంగోల | 1246699 | 9900000 | 40 | 600 |
| 12 | అర్జెంటినా | 2766654 | 33100000 | 94 | 2134 |
| 13 | ఆర్మేనియా | 29800 | 3489000 | – | – |
| 14 | ఆస్ట్రేలియా | 7682300 | 17600000 | 99 | 16350 |
| 15 | ఆస్ట్రియా | 83853 | 7800000 | 98 | 20895 |
| 16 | అజర్ బైజాన్ | 86600 | 7283000 | – | — |
| 17 | బాహమాస్ | 13939 | 255000 | 93 | 11370 |
| 18 | బహరిన్ | 559 | 551000 | 77 | 9990 |
| 19 | బెల్జియం | 30521 | 10000000 | 99 | 17300 |
| 20 | బెర్ముడా | 53 | 60000 | 98 | 24000 |
| 21 | భూటాన్ | 46500 | 1660000 | 15 | 190 |
| 22 | బొలీవియా | 1098581 | 7700000 | 78 | 690 |
| 23 | బ్రెజిల్ | 8511965 | 156600000 | 81 | 2680 |
| 24 | బ్రునై | 5765 | 369000 | 95 | 17000 |
| 25 | బల్ గేరియా | 110912 | 8900000 | 95 | 5300 |
| 26 | కంబోడియా | 181035 | 8800000 | 50 | 1508 |
| 27 | కెనడా | 9976139 | 27800000 | 99 | 19500 |
| 28. | మ.ఆఫ్రికా | 622984 | 3300000 | 40 | 440 |
| 29 | చాడ్ | 1284000 | 5814000 | 30 | 267 |
| 30 | చిలీ | 756626 | 13800000 | 90 | 2800 |
| 31 | చైనా | 9561000 | 1205200000 | 70 | 380 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 32 | కొలంబియా | 138400 | 34000000 | 80 | 1300 |
| 33 | కామొరోన్ | 1862 | 570000 | 15 | 540 |
| 34 | కాంగో | 342000 | 2405000 | 57 | 1070 |
| 35 | కోస్టారికా | 51100 | 3300000 | 93 | 1810 |
| 36 | ఐవొరికోస్టు | 322462 | 13497000 | 45 | 580 |
| 37 | క్రోటియా | 56358 | 4900000 | 90 | 5600 |
| 38 | క్యూబా | 114524 | 10900000 | 96 | 2644 |
| 39 | సైప్రస్ | 9251 | 716000 | 96 | 7812 |
| 40 | జెక్ రిపబ్లిక్ | 78864 | 10400000 | 99 | 7700 |
| 41 | డెన్మార్కు | 43074 | 5200000 | 99 | 20510 |
| 42 | గ్రీన్ ల్యాండు | 2175600 | 55333 | – | |
| 43 | డొమినికా | 750 | 86000 | 90 | 1650 |
| 44 | ఈక్వెడార్ | 283561 | 11300000 | 90 | 1070 |
| 45 | ఈజిప్టు | 997677 | 56100000 | 44 | 700 |
| 46 | యల్ సాల్వెడార్ | 21393 | 5574000 | 75 | 1040 |
| 47 | ఈక్వటోరియల్ | 28051 | 389000 | 55 | 420 |
| 48 | గినియా (యితియోపియా) | 1221900 | 51300000 | 50 | 130 |
| 49 | ఫిజి | 18376 | 747000 | 85 | 1945 |
| 50 | ఫిన్ లాండు | 337032 | 5004000 | 99 | 24770 |
| 51 | ఫ్రాన్సు | 543965 | 57400000 | 99 | 18300 |
| 52 | గాబోన్ | 267667 | 1210000 | 65 | 4400 |
| 53 | దిగ్యాంబియా | 11295 | 902000 | 30 | 235 |
| 54 | జార్జియా | 69700 | 5471000 | – | - |
| 55. | జర్మని | 367020 | 80600000 | 99 | 22215 |
| 56 | ఘానా | 238537 | 16400000 | 60 | 400 |
| 57 | గ్రీస్ | 131990 | 10264000 | 92 | 7730 |
| 58 | గ్రెనడా | 344 | 98000 | 95 | 2800 |
| 59. | గ్వాటెమాల | 108889 | 9784000 | 48 | 1200 |
| 60 | గినియా | 245857 | 6300000 | 35 | 430 |
| 61 | గినియాబిసావ్ | 36125 | 1074000 | 36 | 170 |
| 62 | గుయానా | 214969 | 800000 | 95 | 330 |
| 63 | హెయిటి | 27750 | 6900000 | 53 | 400 |
| 64 | హోండురాస్ | 112088 | 5600000 | 73 | 590 |
| 65 | హాంగ్ కాంగ్ | 1071 | 5800000 | 75 | 13400 |
| 66 | హంగేరి | 93033 | 10500000 | 98 | 2780 |
| 67 | ఐస్ల్యాండు | 102846 | 259000 | 99 | 16200 |
| 68 | ఇండియా | 3287263 | 896600000 | 52 | 350 |
| 69 | ఇండోనేషియా | 1904569 | 194600000 | 85 | 645 |
| 70 | ఇరాన్ | 1648000 | 63200000 | 54 | 2320 |
| 71 | ఇరాక్ | 438446 | 19900000 | 60 | 2400 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 72 | ఐర్ల్యాండు | 70282 | 352000 | 99 | 11200 |
| 73 | ఇజ్రాయల్ | 20772 | 5400000 | 92 | 12500 |
| 74 | ఇటలీ | 301253 | 57800000 | 97 | 16830 |
| 75 | జమైకా | 11425 | 2513000 | 96 | 14000 |
| 76 | జపాన్ | 377765 | 125200000 | 97 | 16830 |
| 77 | జోర్డాన్ | 97740 | 4400000 | 71 | 2070 |
| 78 | కెన్యా | 582646 | 26164000 | 50 | 380 |
| 79 | కిరిబాటి | 861 | 72000 | 90 | 650 |
| 80 | కొరియా ఉత్తరం | 120538 | 13100000 | 99 | 910 |
| 81 | కొరియా దక్షిణ | 98859 | 44500000 | 92 | 6740 |
| 82 | కువాయిట్ | 17656 | 1800000 | 71 | 19700 |
| 83 | లాఓస్ | 236800 | 4600000 | 45 | 200 |
| 84 | లటివాయా | 63700 | 2681000 | — | — |
| 85 | లెబనాన్ | 10400 | 2900000 | 75 | 1000 |
| 86 | లెసొతో | 30355 | 1848000 | 60 | 530 |
| 87 | లైబెరియా | 111369 | 2800000 | 40 | 440 |
| 88 | లిబియా | 1759540 | 5500000 | 64 | 5500 |
| 89 | లైచెన్ స్టైన్ | 160 | 30000 | 100 | 16500 |
| 90 | లిత్వేనియా | 65200 | 3900000 | — | — |
| 91 | లగ్జెంబర్గు | 2586 | 400000 | 100 | 28730 |
| 92 | మకాఓ | 155 | 484000 | 99 | 13527 |
| 93 | మాసిడోనియా | 25713 | 2300000 | 90 | 2400 |
| 94 | మడగాస్కర్ | 587341 | 13300000 | 53 | 230 |
| 95 | మాళవి | 118784 | 10700000 | 25 | 200 |
| 96 | మలేషియా | 330434 | 19200000 | 80 | 2600 |
| 97 | మాల్ దీవులు | 298 | 231000 | 93 | 470 |
| 98 | మాలి | 1240192 | 10000000 | 25 | 270 |
| 99 | మాల్టా | 316 | 400000 | 90 | 7000 |
| 100 | మార్షల్ దీవులు | 181 | 50000 | 86 | 1500 |
| 101 | మౌరిటానియా | 1030700 | 2200000 | 30 | 520 |
| 102 | మౌరిటియస్ | 2040 | 1141000 | 94 | 23400 |
| 103 | మెక్సికో | 1972547 | 90000000 | 92 | 3950 |
| 104 | మైక్రోనేషియా | 702 | 111000 | 90 | 1500 |
| 105 | మాల్డోవా | 33700 | 4458000 | 60 | 2170 |
| 106 | మంగోలియా | 1565000 | 2305000 | 89 | 112 |
| 107 | మొరాకో | 458730 | 27000000 | 50 | 1000 |
| 108. | మొజాంబిక్ | 783030 | 15300000 | 30 | 120 |
| 109 | మ్యాన్మార్(బర్మా) | 676553 | 44600000 | 81 | 250 |
| 110 | నమీబియా | 824292 | 1574000 | 28 | 1400 |
| 111 | నైరు | 213 | 9400 | 99 | 20000 |
| 112 | నేపాల్ | 147141 | 21100000 | 29 | 180 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 113 | దినెదర్‌ల్యాండు | 41160 | 15300000 | 99 | 21030 |
| 114 | న్యూజీల్యాండు | 269057 | 3500000 | 99 | 12680 |
| 115 | నికరాగ్వా | 130000 | 4100000 | 57 | 425 |
| 116 | నైజర్ | 1267000 | 8500000 | 28 | 310 |
| 117 | నైజీరియా | 923768 | 119300000 | 51 | 315 |
| 118 | నార్వే | 323895 | 4300000 | 99 | 23120 |
| 119 | ఓమన్ | 300000 | 1700000 | 52 | 860 |
| 120 | పరాగ్వే | 406752 | 4660000 | 90 | 1460 |
| 121 | పెరూ | 1281215 | 22900000 | 85 | 1070 |
| 122 | ఫిలిప్పైన్సు | 299404 | 66500000 | 88 | 850 |
| 123 | పోలెండు | 312677 | 38500000 | 98 | 1830 |
| 124 | పోర్చుగల్ | 92072 | 9900000 | 83 | 5930 |
| 125 | కాటర్ | 11437 | 484000 | 76 | 15860 |
| 126 | రుమేనియా | 237500 | 23400000 | 96 | 3100 |
| 127 | ర్వాండా | 26338 | 7800000 | 50 | 270 |
| 128 | శాన్ మారినో | 61 | 23000 | 97 | 8250 |
| 129 | సౌదిఅరేబియా | 2250070 | 16500000 | 62 | 7820 |
| 130 | సెనెగల్ | 196162 | 7900000 | 35 | 720 |
| 131 | సింగపూరు | 616 3 | 12800000 | 85 | 16440 |
| 132 | స్లొవేలేవియా | 20552 | 1980000 | 90 | 10700 |
| 133 | సోమాలియా | 637657 | 9500000 | 24 | 170 |
| 134 | సౌత్ ఆఫ్రికా | 1221037 | 40800000 | 99 | 3025 |
| 135 | స్పెయిన్ | 504750 | 39184000 | 97 | 12450 |
| 136 | సుడాన్ | 2505813 | 27400000 | 27 | 450 |
| 137 | సురినేమ్ | 163820 | 410000 | 65 | 3600 |
| 138 | స్వాజిల్యాండు | 17363 | 913000 | 65 | 810 |
| 139 | స్వీడన్ | 449793 | 8700000 | 99 | 25110 |
| 140 | స్విజర్‌ల్యాండు | 41293 | 6900000 | 99 | 33610 |
| 141 | సిరియా | 185180 | 13800000 | 65 | 1160 |
| 142 | తైవాన్ | 35981 | 20600000 | 90 | 8815 |
| 143 | టాంజానియా (తాంజానిప) | 945087 | 28800000 | 90 | 100 |
| 144 | తాయిల్యాండు | 542373 | 56900000 | 89 | 1570 |
| 145 | టోగో | 56785 | 3900000 | 45 | 410 |
| 146 | టోంగా | 748 | 108000 | 99 | 910 |
| 147 | ట్రినిడార్ | 5128 | 1285000 | 96 | 3670 |
| 148 | టునిషియా (టొబాగొ) | 164150 | 8600000 | 65 | 1500 |
| 149 | టర్కీ | 779452 | 59600000 | 80 | 1780 |
| 150 | ఉగాండ | 241139 | 19200000 | 52 | 170 |
| 151. | దియూక్రేన్ | 603700 | 52200000 | – | 2340 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 152 | యు ఎ ఎమరేట్సు | 82880 | 1700000 | 68 | 20140 |
| 153 | యూనైటెడ్ కింగ్ డం | 244108 | 57800000 | 99 | 16550 |
| 154 | అమెరికా | 9372614 | 257800000 | 99 | 22240 |
| 155 | ఉరుగ్వే | 176215 | 3080000 | 96 | 2560 |
| 156 | ఉజ్బెకిస్తాన్ | 447400 | 21900000 | – | 1350 |
| 157 | వన్వాటు | 14760 | 174000 | 90 | 1120 |
| 158 | వెనిజులా | 912050 | 20675000 | 88 | 2730 |
| 159 | వియత్ నాం | 329556 | 70900000 | 86 | 220 |
| 160 | పశ్చమసోమో | 283౬5 | 1250000 | 38 | 930 |
| 161 | యెమెన్ | 531000 | 13000000 | 38 | 520 |
| 162 | యుగొస్లేవియా | 102173 | 10600000 | 90 | 5040 |
| 163 | జైరె | 2344885 | 41200000 | 72 | 180 |
| 164 | జింబాబ్వే | 390272 | 10900000 | 67 | 650 |